# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

రచించింది

శ్రీ గుడిపాటి వెంకటచలంగారు, బి. ఏ., యల్. టి.




ప్రచురించింది

అభిసారికా గ్రంథమాల, మచిలీపట్నం.

ముద్రణ:
మినర్వా ప్రెస్,
మచిలీపట్నం.

కిమ్మత్తు:
ఆరణాలే
ప్రతి ఒకటికి.

(1) పెళ్లిచెయ్యడం - ఇది ఆర్థనాశక్తి తక్కువ కావడంవల్ల చాలా సమస్యల్ని తెచ్చిపెడుతోంది.

(2) పెళ్ళిలేకండా ఏర్పాట్లు చెయ్యడం - నీతి వొప్పుకోదు - గర్భాలూ, రోగాలూ, వీటి భయం.

(3) వాళ్ల గతికి వాళ్లని వొదిలెయ్యడం - భయంతో బెదిరింపులతో పాలించడం - ఇది ఇప్పుడు జరుగుతున్నపని.

పైకి వాంఛని రానియ్యకపోవడంవల్ల ఆవాంఛ పిల్లలకి లేదనీ, ఉన్నా ఏమీ ఇబ్బందిలేదనీ తలితండ్రులు సమర్థించుకుంటారు. అసలా విషయం ఆలోచించరు.

ఇందు మూలాన masterbation స్పెర్మటోరియాలు ఎక్కువవుతున్నాయి. కాలేజి కుర్రాళ్ళకి చదువులమూలాన అసలే శక్తి తక్కువగాని, లేకపోతే సోడమీకూడా యింకా ఎక్కువగా వుండేది.

అసహజమైన విధంగా, ప్రయత్నపూర్వకంగా, కామ వాంఛని తృప్తిపరుచుకోడం (masterbation) మేస్టర్బేషన్ అంటారు. కలలోగాని, మూత్రంలోగాని, వీర్యనష్టం (pollutions) 'పొల్యూషన్సు' అంటారు. ఈ రెండూ యవ్వనం అంకురించే సమయంలో పిల్లలలో కనిపిస్తోవుంటాయి. నీతిపరులూ, మందుల వర్తకులూ, కలిసి యీ రెంటినీ చాలా ఘోరంగా చిత్రించారు. వాళ్ళ వర్ణనలూ, వాళ్ళు పెట్టే భయాలూ, చూస్తే గుండెబద్దలవుతుంది. masterbation చాలా చిన్న పిల్లలలోకూడా కనపడుతుంది. పెద్దవాళ్ళు చూసీ చూడనట్టు వూరుకోవాలి. దానంతట అదే పోతుంది. దండించడం, భయపెట్టడం, విషతుల్యం. యవ్వనంలోకూడా యీ విషయాల్లో

సానుభూతిచూపి వాటిని నిర్లక్ష్యంగా సహజంగా చూడాలి. అసలు పిల్లలు పెద్దవారికి తెలీనీరు. తెలిసినప్పుడు పెద్దవారు వాటిని ఘోరంగా చూడకూడదు. చాలా ముదిరితే తప్ప, యీ అలవాట్లు యేమీ అపాయంకావు. భయమూ, విచారమూ, పశ్చాత్తాపమూ ఇవే పిల్లలకి అపాయకరమైనవి. masterbation అసహజమైనదే. కాని కామోద్రేకాన్ని ఏం చేసుకోవాలి పిల్లలు? ఆడపిల్లలకి గర్భాలు తెప్పించేకన్న, ఏమీ తెలీని పసిపిల్లలని 'రేప్' చెయ్యడంకన్న, స్త్రీలనించి రోగాలు తెచ్చుకోడంకన్న, masterbation నయంకాదా? పిల్లలు ఈ వుద్రేకాన్ని అణుచుకోవాలి. నిగ్రహశక్తి కావాలి అంటారు రోజూ భార్యల్ని బాధించే పెద్దలు. ఏ పిల్లలూ అణుచుకోరు. వాళ్ళకి చేతకాదు. అణుచుకుంటున్నట్లు నటిస్తారు. ఆ నటనే పెద్దవారికి కావలిసింది. ప్రేమలేని భార్యలతో కలవడంకన్న పెద్దవారికి కూడా masterbation ఎక్కువ సహజం నీతివంతం.

చిన్నవాళ్ళకి masterbation, pollutions ఇటువంటివి తటస్థించినప్పుడు పెద్దవాళ్ళు కామోద్రేకాన్ని అణుచుకోడానికి సాధనాలు అలవాటుచెయ్యాలి. చన్నీళ్ళ స్నానం, చాపమీద పక్క, చాలా శరీరానికి మనసుకీ పనికలిగివుండడం, స్త్రీలనించి, చలంపుస్తకాలనించి దూరంగావుండడం, ఇవన్నీ సహాయంచేస్తాయి.

యోగ ఆసనాలు చాలా ఉపకారం చేస్తాయి యీ విషయంలో-ముఖ్యం సర్వాంగ ఆసనం.

ఇవన్నీ పాతపద్ధతులే అంటారా, మనం మరిచిపోయి నాము కనక జ్ఞాపకం చేస్తున్నాను. మరిచిపోలేదంటారా, అయితే పిల్లలకి ఇవి ఉపయోగపడే విధం మరిచిపోయినాము.

రోగాలని నివారించుకునేపద్ధతులు,గర్భనివృత్తిమార్గాలు, యవ్వనంలో కనపడే వాంఛారూపాలు, మోహాబలం, ప్రేమ స్వాతంత్ర్యం.— ఈ సమస్యల్ని వేటిని ఎత్తినా, రోజూ సుఖంగా పక్కలమీద తృప్తిపడే మనుషులు, 'నిగ్రహం, నిగ్రహం,' అని ఇతరులకి సలహాకింద అరుస్తారు. పత్రికలకీ, దేశసేవకులకీ ఇది మామూలయింది. యువకులకి ప్రతివాడు యీ బోధన చేసేనాడే. రెండు సంగతులు ఆలోచించాలి.

నిగ్రహం అవసరమా ?

నిగ్రహం సాధ్యమా ?

తప్పనిసరి ఐతేనేకాని, నిగ్రహంలో, ఏమీ ఔన్నత్యం లేదు. పైగా హానివుంది. స్త్రీలనించి తప్పుకునేవాడు కలల నించి తప్పుకోలేడు - పగటికలలూ రాత్రి కలలు కూడా. కలల నించీ తప్పుకునేవాడికి, దేహానికీ మనసుకీ కూడా జబ్బుచేస్తుంది. సుఖాల్ని వొదలుకోడంవల్ల దొంగమహిమలున్నాయని ప్రపంచాన్ని మోసపుచ్చడంతప్ప ఇంక ఏమీ ప్రయోజనంలేదు.

కొందరు నిజంగా 'సెక్సు' ని sublimate చేసుకోగల వారున్నారు. అంటే వేరేశక్తికింద మార్చుకోగలిగినవారు. వారు( rare exceptions) సకృతు. సామాన్య ప్రజలకీ, యువకులకీ, యీ నిగ్రహం బోధించడం, ఎవరో రుషులకి వూపిరి బిగపట్టడం చాతనవును గనక 'మీరందరూ వూపిరి బిగపట్టిచావండి' అన్నంత మూర్ఖం.

ఈ కోర్కెలో నీచత్వమంతా, దాన్ని అణుచుకోమని బోధించే కుళ్లుమనసుల్లోవుంది. వాళ్ల జీవితంలో కామం విషమించింది. దురదృష్టవంతులు, నీచులు, ఈ అమరసుఖాన్ని

కుళ్ల పెట్టుకున్నారు. సంభోగం త్యజిస్తేనే వాళ్ల ఆత్మకి సుఖం. అందుకని అందరికీ ఆగతే పట్టిందనుకుంటారు. తమకిలేని సుఖం ఇతరులు అనుభవించిపోతారని ఈర్ష్య.

స్త్రీపురుషులు కలుసుకోకండా ఎట్లానూ ఆపలేరు. కలుసుకోడంవల్ల వొచ్చే సమస్యల్ని ఎదుర్కొనే సాహసంలేదు. కనక 'నిగ్రహం, నిగ్రహం' అని చిలకపలుకులు పలుకుతో అంతరాత్మలకి ఉపశాంతి నిచ్చుకుంటారు.

నిగ్రహం, సహజంగా సాధ్యమైనప్పుడు, అవసరమై నప్పుడు, చాలా ఆరోగ్యవంతం. అసలు శక్తిలేనివాడు గొప్ప నిగ్రహికింద చెలామణి అవుతున్నాడు, కళ్లూ, రసమూ లేని వాడు ఏకపత్నీవ్రతుడైనట్టు, కురూపి పతివ్రతఐనట్టు. నిగ్రహం వుండాలని బోధించేవాళ్ళకి, నిగ్రహమెంత కష్టసాధ్యమో తెలీదు. ఎందుకంటే, వాళ్ళకి అసలు లేదు గనుక. బలవంతమైన నిగ్రహంవల్ల, మనసుకీ, శరీరానికీ చాలా అపకారం జరుగు తుంది. ఈ కుహనా వివాహ నిర్బంధంవల్ల నిగ్రహం బోధిం చడంతప్ప వేరే గతిలేకండా పోయింది, మతకర్తలకీ నీతి బోధ కులకీ.

---

# దాంపత్యసుఖం

-:o:-

తక్కిన వేదాంతమంతా యెట్లావున్నా, వ్యక్తితనకువున్న ప్రత్యేకశక్తుల్ని యెంతబాగా వినియోగించడానికి వీలుకలగచేసుకో

గలిగితే అంత అభివృద్ధిపొందుతున్నాడు, అంత ఆనంద మనుభ విస్తున్నాడు అన్నమాట నిజం. ఈ శక్తులూ, వాంఛలూ, ఆశయాలూ, అన్నీ యీశ్వరుడిలో సఫలీకృత మౌతాయని అంటారు. ఆసంగతి ఎట్లావున్నా ఆ యీశ్వరుడి తరవాత యీలోకంలో మనుష్యజీవితాన్ని సౌందర్యంతో నింపి సర్వ శక్తులకూ, వాంఛలకూ, ఆశ్రియమై, సాఫల్యం చెయ్యగల మహాత్మ్యంగలది యీ స్త్రీపురుష ప్రేమ. ఉత్తమ స్త్రీప్రేమలో లీనమయ్యే అదృష్టంగల పురుషజీవితము పొందే ఆనందం, తది తరులకు మానసాతీతము. స్త్రీ జీవితమూ అంతే. కనక ఉత్తమ వ్యక్తినించివొచ్చే పుష్కలప్రేమ మన జీవనానికి పరమ అవస రము, మకుటము. మతగ్రంథాలలో వర్ణించే యీశ్వరుడి భక్తి తప్ప యింకొకటి దాంపత్యప్రేమకన్న ఉత్తమమైనదిలేదు. దాని కోసము ప్రతివారూ ప్రయత్నించాలి.

ప్రితివారికి వారి స్వభావాలనూ, సంస్కారమునుబట్టి, తాము ప్రేమించగల వ్యక్తినిగురించి ఒక ఆశయమూ, ఒక వూహా వుంటుంది. దేహసౌందర్యమూ, మానసికచాతుర్యమూ ఆత్మౌన్నత్యమూ, వీటిఅన్నిటినిగురించి కోర్కెలు వుంటాయి,- మృగప్రాయులకి తప్ప. కనక మనసులోని ఆ ఆశయానికి తగిన మనిషి దొరికేవరకూ ఎవరూ సంతుష్టిచెందకూడదు. తక్కువ రకపు మనుషుల్ని భర్తగానూ భార్యగానూ స్వీకరించాధా, జీవితం శుష్కమైపోతుంది; పొందగలిగిన మానుషాతీతమైన సౌఖ్యానికి అంధులవుతారు. చాలమంది ప్రజలకు యీ ఆశ యము వుండదు. అట్లాంటివారు వంట బాగా చేయగల భార్య లనూ, డబ్బు సంపాయించే భర్తలనూ, ఏరుకో వచ్చును.

కాని (evolution) పరిణామము జనులలో జరుగుతున్న కొద్దీ, సంస్కారము అభివృద్ధి పొందుతున్న కొద్దీ, ప్రజల ఆశయాలూ, ఆశలూ, (tastes) రుచులూ, అభివృద్ధి పొందుతున్నాయి. అట్లాంటివాళ్ళు తక్కువ వ్యక్తులతో హీనగుణాలతో సంతుష్టి పడకూడదు. అమితమైన సౌందర్యాశయం వుంటే దానికోసం వేచివుండవలిసిందే. కొంచెం తక్కువ సౌందర్యంవున్న భార్యనూ స్వీకరించకూడదు. గుణాలు అంతే! జీవితమంతా వ్యర్థంగా గడిపినా దిగులులేదు. కాని ఆశయంనించి దిగజారకూడదు. కాని తమ హృదయంలో లేని ఆశయాలను, పుస్తకాల్లో చదివీ, యితరులనించి వినీ, వాటిని తమవాటిగా చేసుకోవాలనే ప్రయత్నమూ, వ్యర్థమే. పొరబాటే.

పొరబాట్లు తటస్థించవొచ్చును. తమ ఆశయానికి సరిపడ్డవారిని ఒకరిని వివాహమాడి, పొరబడ్డామని కొంత కాలంలో తెలుసుకొన్నపుడు, వెంటనే ఆ సంబంధం మాని వెయ్యాలి. ఒకప్పుడు యింకొక వ్యక్తిని కలుసుకున్నప్పుడు తాము పొరపడ్డామని అర్థమౌతుంది. అప్పుడు వెంటనే పాత సంబంధం వొదిలివెయ్యాలి. అంతంలేని సాహసంగల 'ఎక్స్పరిమెంట్సు' అత్యంత అవసరము, ఆత్మవృద్ధికి.

అసంతృప్తి, బాధ, యితరతృష్ణ లేకుండా చేయగలిగిన సంబంధమే, నిజమైనది, తగినది. అదివొకటే Test. ఇంక వేరువాంఛ వుండడం వీలులేనంత ఆత్మసంతుష్టిని కలగచెయ్యాలి. ఒకొక్కప్పుడు రెండుమూడు సంబంధాలు ఏకకాలమందే కావలిసి రావచ్చును, తాత్కాలికంగా మార్పు అవసరం కావొచ్చు; కాని వాటిని గుర్తించి, స్వీకరించే వివేకం వుండాలి.

ప్రేమధనాన్ని వృధాచెయ్యకూడదు. వెదచల్లకూడదు. మనోపరీక్షచేసుకుని, ఎవరికి హృదయపుష్పం సమర్పించాలో నిర్ణయించుకోవాలి. అటువంటివారు దొరికిందాకా, లోభివలె ప్రేమను దాచివుంచాలి. ఆశయం పూర్తికాంది, తక్కువ ప్రత్యామ్నాయంతో సంతుష్టిచెందే, వ్యభిచారానికి లొంగకూడదు.

మన ఆశయం సఫలీకృతం కావాలంటే మన స్వభావం అభివృద్ధిచెందాలి. మనం హీనులమైనకొద్దీ, మన ఆశయం హీనమౌతుంది; మనం దేనికోసం తపస్సు చేస్తున్నామో, ఆ వరం మనవాకిలి దగ్గిరికి వొచ్చినప్పుడు మనం గుర్తించలేము. ఆ రెండోవారికి మనమీద యిష్టంకలగదు. మన నీచజీవితాన్ని అర్పించడానికి మనకే సిగ్గుకలుగుతుంది. మన ఆశయం అతి వున్నతమైతే, దాన్ని అందుకోడంకోసం జన్మమంతా గడిపినా వ్యర్థంకాదు. కాని అది నిజంగా మన ఆశయమే కావాలి.

అటువంటి వున్నతాదర్శమే హృదయంలో వుంటే, ఆ ఆశయానికి అందని మనిషిని తాకడం నీచమూ, పాపమూ, అపరాధమూ, ఐపోతుంది, స్త్రీగాని, పురుషుడుగాని. ఈ శరీరాన్ని మనసుని, నిర్మలంగా, జాగ్రత్తగా, వుంచాలి, రాబోయ్యే ఆదివ్యమూర్తికి ఆనందంతో అర్పించడానికి.

ఇటువంటి ఆశయము గల మనుషులు, ప్రజాసామాన్యానికేర్పడ్డ యీ సాధారణపు చట్టాలకు, సంఘు కట్టుబాట్లకు, ఆచారాలకు లొంగడం మహాపాపం. అన్నిటికీ తిరగబడాలి. లెక్కచెయ్యకూడదు. ముఖ్యముగా తన **Instinct** ను పరీక్షించి, దాని నిర్దేశానుసారం తన జీవితాన్ని నడుపుకోవాలి.

ధర్మమూ, అధర్మమూ, నీతీ, అవినీతీ, అన్నీ హృదయ స్తములు. అన్నీ సామాన్య ప్రజల్ని అల్లరినించి తప్పించి, శాంతిని నిలబెట్ట డానికి యేర్పడ్డ మూఢనమ్మకాలు. హృదయాదేశానుసారం నడవ డానికి జంకేభీరులకు గతులులేవు, అభివృద్ధిలేదు. అందమైన అవయవము, ఉన్నతమైనగుణము, కనపడ్డ ప్రతివ్యక్తి తనని ఆకర్షించేటట్టయితే, ఆ ఆకర్షణకన్న వేరే ఆశయములేకపోతే, అట్లా ఆకర్షింపబడి, వీలైనప్పుడల్లా అనుభవించడమే పరమధర్మం. కాని వున్నతాదర్శం వున్నప్పుడు Instinct వద్దన్నప్పుడు సర్వసంబంధాలనూ త్యజీకరించడమూ ధర్మమే. ఎంతప్రేమ గల భర్తనుగాని భార్యనుగాని ఉన్నతాదేశంకోసం అంతకన్న ఆత్మతృప్తికరమైన సంబంధంకోసం వదలడం, ఉత్కృష్టమైన ధర్మం, విధి. బుద్ధుడు సంసారం వొదిలిన ఆ దేశం యెటువంటిదో, యిదీఅటువంటిదే. సాహసంచేసి, జీవితాన్ని అనుభవసముద్రంలో ముంచగల ధీరులకే అభివృద్ధి. లెక్కపెడుతో, రోగాలుఅనీ, అవినీతి అనీ, నరకమనీ, అవుమర్యాదనీ, శుష్కించే నిర్భాగ్యులకు యీజీవితమే నరకం, బతకడం వృధా.

ఆత్మే ప్రమాణం. ఏ కార్యం చేసిన తరవాత నీచంగా 'ఫీల్' (feel) అవుతారో, ఆ కార్యం పాపం. ఏ కార్యము ఆరోగ్యంగా ఆనందకరంగా వుంటుందో అది ధర్మం. ప్రతి హృదయంలో యీశ్వరుడు ప్రకాశిస్తున్నాడంటారు. వుంటే అతడే నడుపుతాడు. అడిగి తెలుసుకోవాలి. తెలుసుకున్న తరవాత సాహసంతో ఆచరించాలి.

లోకంలో వున్న మనుషులందరూ ఒక పరిణామావస్థలో లేరు. ఒక్క ఆత్మోన్నత్యంలో లేరు. సంస్కారాలు, కర్మలు

వేరు. 'హెరిడిటీ' వల్లగాని, జన్మపరంపరలవల్లగాని, మను షులు వివిధములైన 'స్టేజస్‌లో' వున్నారు. పేడ పురుగుకూ, యేనుగకూ వున్న తారతమ్యం, మనిషికీ మనిషికీ వుంది. అం దర్నీ కలిపి మనుషులనడం పొరబాటు. అందరికీ ఒకే ధర్మాన్ని, నీతిని విధించడం అవివేకం. కనక ఎవరి స్వభావాన్ని వారు పరీ క్షించుకుని, ఎవరి నీతిని వారు నిర్ణయించుకోవాలి. ఎవరి ఆశ యాన్ని వారు అనుష్టానంలో పెట్టుకోవాలి. కొందరికి భౌతిక సౌందర్యం తప్ప ఏమీ అర్థంకాదు. వారు దాన్నే అనుభవిం చాలి. కొందరికి ఆత్మ సౌందర్యం, కొందరికి గాన సౌందర్యం, కొందరిక పవిత్రత, కొందరికి 'డివోషన్' సేవ,కొందరికి అధికారం, మాతృప్రేమ- మొగవారికి మొగవారిని చూసి ఆకర్షణ—యిన్ని విధాల కోర్కెలు వుంటాయి. వారు వారి వారి వాంఛల ప్రకా రం అనుభవించవలసిందే. వూరికే ప్రజల్ని చూసి భయపడి, తమవి కాని ఆశయాలను ప్రకటించడం నటించడం మర్యాద అను కుని తమ సహజ వాంఛలను నొక్కి, వంకరతిప్పి, ప్రజలు భ్రష్టులై, స్వేచ్ఛగా, ఆనందాన్ని తమ తాహాతుకు తగినట్లు పొందక, కుళ్ళి, అన్నిటికీ చెడుతున్నారు. జీవితం అనంతం. ఈనాడు భౌతికంగా శరీరాల్ని అనుభవిస్తేనేం? అదే మార్గం ఉన్నతాదర్శాలను కనుక్కోడానికి! విరక్తివల్ల, త్యాగంవల్ల హృదయం శుష్కించడమే ఫలం.

సుఖంగా, దేహసౌఖ్యాన్ని కోరే మనిషి, పురాణాల మనుషుల్నీ నమ్మి గుణాలను ప్రేమించాలనీ, ఏకపత్నీవ్రతం చెయ్యాలనీ ప్రయత్నిస్తే, అతనికా ఔన్నత్యం స్వతసిద్ధం కాదు గనక గుణాలనూ ప్రేమించడు. పైగా అన్యాయంగా తనకు

సహజమైన శరీరసౌఖ్యాన్ని పాడుచేసుకుంటాడు. సౌందర్యా రాధకుడైన చిత్రకారుడు వంశమనీ, సంస్కారమనీ, కురూపిఐన పతివ్రతను పెళ్ళిచేసుకుంటే, యీ పాతివ్రత్యాన్ని అనుభవించ నూలేడు- సౌందర్యారాధనారాదు. వ్యభిచారి ఐనా ఒక సుం దర విగ్రహాన్ని ఆరాధించడమే అతని ముక్తి—ఆమె యింకెవరి భార్య ఐనా సరే!

మంచి వంటవాళ్ళూ, పతివ్రతలూ, కురూపులూ, స్వార్థ పరులూ, ఉద్యోగస్తులూ, మర్యాదపరులూ, సామాన్య ప్రజ లకు కావాలి. కవులకూ, రసజ్ఞులకూ, ఆధ్యాత్మికా సంపన్ను లకూ, చిత్రకారులకూ, కావలసినవారు, విశాల హృదయంతో నీతి విచ్ఛేదనం చేసేవారూ, సౌందర్యంలో లోకాల్ని దిగ్భ్రమ చెందించేవారూ, హత్యలూ, విప్లవాలూ, కలిగించగల చేవగల వారూ, ఒక్క గంట అనుభవంచేత, జీవితం సాఫల్యమయిందని పించేవారూ.

నిజమైన మోహం, యెవర్ని మోహిద్దామా అని వెతు క్కుంటో బైలుదేరితే వొచ్చేదికాదు. స్త్రీ పురుషులు స్వేచ్ఛగా కలుసుకుంటో వుంటే యెవరిమీదో మోహం కలు గుతో వుంటుంది. అప్పుడు కలగాలి పెళ్ళి వాంఛ. ఇంక ఆ రెండో వ్యక్తీ తానూ ఐక్యమైనామని, ఆ వ్యక్తిగాక యిం కెవరూ తనకి లోకంలో లేరని తోచినప్పుడే కలగాలి వివాహానికి అవసరం.

మోహం కలక్కముందే బాల్యమందే గర్భాదానాలు కానియ్యడంవల్ల చాలా అనర్థాలున్నాయి.

1. శరీరాలు లేతగా వుండడంవల్ల అనారోగ్యం.

2. సంతానం బలహీనం.

3. అందం నలిగిపోవడం. ముఖ్యంగా స్త్రీది.

4. భార్య మనసు లేతది కావడంచేత స్వతంత్రంగా ఆలోచించుకునే శక్తిలేక, భర్త అభిప్రాయాలే తనవిగా చేసుకుని మానసిక బానిసత్వం చెయ్యడం.

5. సంసార బాధ్యతా, కాన్పులూ, భర్త అధికారమూ, బంధువుల అధికారమూ, వంటా, చాకిరీ, చివాట్లూ అన్నీ ఆడుకునే వయసులోనే భరింపవలసి రావడంవల్ల జీవితంలో సంతోషమే నశించడం. యెదిగే శరీరం ఆగుతుంది. వికసించే బుద్ధి మందగిస్తుంది, త్వరలో ముసలిదై, అనుభవించవలసినవన్నీ, పెళ్ళీ, భర్తా, పిల్లలూ, చావులూ, 'బయస్కోపు'లో వలె చాలా త్వరలో కళ్ళయెదట, నిమిషంలో ముగియడంచేత, నూరేళ్లూ నిండినదై, ఆశా ఆనందమూ, యేమీ లేక జీవించే కళేబరంగా తయారౌతుంది.

6. పిల్లల్ని పెంచడానికి వారి శిక్షణకి కావలసిన జ్ఞానమూ, క్షమా వుండకపోవడం. ఇది పిల్లలకి చాలా బాధా, నష్టమూ.

భార్యనీ పిల్లల్నీ పోషించగల సంపాదన కలిగే వరకూ మొగవాడు పెళ్ళిచేసుకోకూడదు. చేసుకున్నాడా తనేగాక, తన భార్యనీ, పిల్లల్నీ ఆర్థికంగా తలిదండ్రులు అత్తమామలు మొదలైన వారికింది బానిసల్ని చేసి అతి నీచస్థితిలో పడతాడు. తన ఆదర్శాలూ, ఔన్నత్యమూ, అభివృద్ధి, సంసారం కోసం అనవసర త్యాగంచేసి భ్రష్టుడౌతాడు.

పెళ్ళిచేసుకోడానికీ పిల్లల్ని కనడానికీ అర్హతలేని వాళ్ళనే కులున్నారు.

1. తమ ద్వారా సంతానానికి రాగల జబ్బులు కల వాళ్లూ ఉ॥ పిచ్చివాళ్లూ, చెవిటివాళ్లూ, సుఖరోగులూ,

2. తాగుడు మొదలైన దురభ్యాసాలు కలవారు.

3. బలహీనులు, దీర్ఘరోగగ్రస్తులు.

వీరి కొకవేళ స్త్రీ సంపర్కమున్నా, పెళ్ళీ పిల్లలూ కలిగించుకోడం పొరబాటు. సంఘం యెడల గొప్ప అపచారం.

పెళ్ళికి తగిన వయసు స్త్రీపురుషులకు ముప్ఫై నలభై సంవత్సరముల మధ్య వయసు. యీలోపల స్త్రీలూ, పురుషులూ, ఒకరివిషయము ఒకరు బాగా తెలుసుకుంటారు. చంచలమైన బుద్ధి కుదట పడుతుంది. మార్పులూ, రుచులూ, ఉద్రేకమూ అనుభవంవల్ల తగ్గుతాయి. జీవితంలో ధనముతో అనుభవంతో స్థిరపడతారు. ఇంక శాంతీ పిల్లలూ సంసారమూ కావాలనిపిస్తుంది. ఈ లోపుగా, సంసారాలుగా యేర్పడకండా, స్త్రీపురుషులు, శరీర హృదయానుభవాలద్వారా ధర్మార్థ కామమోక్షాలు సమర్పించుకోవాలి. కాని వయసు ముదిరిన తరవాత కలిగిన సంతానం అంత వృత్తమంగా వుండదని శాస్త్రజ్ఞులు కొందరు అభిప్రాయ పడుతున్నారు. ఆ అభిప్రాయంతో యేకీభవించినవారు—

ఇద్దరూ పద్దెనిమిదేళ్లలోపలే పెళ్ళిచేసుకుని, ఒకపదేళ్ళనుభవించి, కావలసిన పిల్లలనుకని, వారిని పాఠశాలలో ప్రవేశపెట్టి సంసారబంధం అట్టే లేకండా, యెవరిపని వారు చూసుకోవచ్చు; విడిపడిపోవచ్చు.

భార్యాభర్తలు, పెళ్ళికిముందు, పెళ్ళికి తాము తగిన వారవునో కాదో డాక్టరుచేత పరీక్షచేయించుకోవాలి. డాక్టరు సర్టిఫికెట్ లేనిది పెళ్ళిచేసుకోకూడదని ప్రభుత్వమువారు నిర్ణయించడం వృత్తమం.

ముందుముందు తగాదాలు రాకండా, పెళ్ళికిముందే దంపతులు కొన్నివిషయాలలో వాళ్ళవుద్దేశ్యాలు వెలిబుచ్చుకుని, అర్థంచేసుకుని, నియామకా లేర్పరుచుకుతీరాలి. మొదట ప్రేమ పరివాహంలో వున్నప్పుడు తమ కెన్నడన్నా అభిప్రాయ భేదాలు వొస్తాయా అనుకుంటారు. వొచ్చితీరతాయి.

1. పిల్లల్ని యెప్పుడు, యెంతమందిని కనడమో, అసలులేదో !

2. వారి బాధ్యతని యెవరేంతవరకు తీసుకుంటారో, మొదలైనవి.

3. యిప్పుడుయావజ్జీవబంధంప్రకారం పెళ్ళిచేసుకోటం అతినీచం. కనక యీ వివాహచట్టాలు మారాలి. అవి మారిందాకా, వేరే వివాహవిధిని యేర్పాటు చేసుకోవాలి. యిద్దరిలో యెవరికన్నా విడిపోవాలనివుంటే, యేకారణమూ, యెవరికీ నివేదించుకోనక్కర్లేకండానే, విడిపడే స్వతంత్రపద్ధతి మీదనే వివాహం చేసుకోవాలి. జన్మమంతాగాని, ఒక్క గంటకైనా గాని, వాగ్దత్తాలడగడమూ, పుచ్చుకోవడమూ మూర్ఖం.

ఇంకా. వారివారికి సంబంధించినవిషయాలు, వృత్తి, బంధువులు, సంసారానికి ధనం యెవరెంత వినియోగించేదీ, యింకా రహస్యవిషయాలు, తమ కింకెవరిమీదన్నా మనసూ, చనువూ వుంటే అది, అన్నీ మర్మంవిడిచి మాట్లాడాలి. ఒకరి గతజీవిత

రహస్యాలు యింకొకరితో చెప్పుకోనవసరంలేదు. కాని చెప్పక చెప్పామనే అబద్ధాలుమాత్రం కూడదు.

ఇద్దరికీ వివాహం యిష్టమైన తరవాత యింకా, లోకంలో ఏదీ వారి వివాహానికి అడ్డం రాకూడదు.

ఎట్లా పెళ్లి ఐన వారికైనా మొదట్లో కామం అమితంగా వుంటుంది గనక, ఆ కామజ్యోతి ముందు కురూపులు సౌందర్యవంతులూ, గుడిశ సౌధమూ, వెకిలితనము బుద్ధి కుశలతావలె తోస్తుంది. తమ హృదయంలో వుండే సరసమూ, కవిత్వమూ, కలిపి రెండో వారికి రంగువేసి చూసుకుని, మోసపోయి, సంతుష్టిచెందుతారు. వున్నతమైన ప్రేమసంగతి మాట్లాడేటప్పుడు, తమకున్న యీ నూతన కామం సంగతే వారు సూచించేది. కొద్దికాలం గడిచి, కామం తగ్గి, ఒకరికొకరు భార్యా భర్తలు పాతపడగానే, నిజం బైటపడుతుంది. రాత్రులు అప్పుడప్పుడు మాత్రమే భార్య అందంగా కనపడుతుంది. తక్కినప్పుడు పచ్చడి రుచుల్లోనూ, పిల్లల యేడుపు మొహాల్లోనూ, కాళ్ళు పట్టించుకోడంలోనూ, భార్య సుగుణాల్ని, పాతివ్రిత్యాన్నీ, శీలాన్నీ, రుచిచూస్తో వుంటాడు భర్త. నగల్లోనూ; చీరలలోనూ, అతని ప్రేమ ఆమెకి ప్రత్యక్షమౌతుంది. పోట్లాటలు మొదలు, చిరాకూ, కోపమూ, దూషణా, అన్నీ యెక్కువౌతాయి. కాని ఒకరినొకరు వొదలరు. వొదిలే శక్తి యిద్దరిలో వొకరికీ వుండదు. అందుకని మనసులో ఆ సంసారస్థితే మంచిదనీ, మోహం ప్రేమగా మారి, ఆధ్యాత్మికమయిందనీ, అసలు పెళ్ళికి మోహం అఖ్ఖర్లేదనీ, శాశ్వతమైన సద్గుణాలు కావాలనీ, యీ పోట్లాటల్నీ, దూషణల్నీ, దెబ్బల్నీ,

వాకిరినీ, మురికినీ, లక్ష్యంచెయ్యని, వున్నతమైన, తమకీ ఎవరికీ కన పడని, దివ్యఆధ్యాత్మిక మహాప్రేమానుబంధం అడుగున యెక్కడో సంస్కారమై, యీ సంసారాన్ని పాలిస్తోందనీ అం టారు పైకి; వంటకీ, పిల్లలకీ, నగలకీ, మర్యాదకీ, శరీరాలకీ, మంచాలకీ, అలవాట్లై. ఆ అలవాటే, ఆ వొకర్ని వొకరు వొదలలేని అసహాయత్వమే, భయమే, మహాప్రేమగా పరిగ ణించుకుని ; భోజనంవేళకి చేసినట్టే, సంతోషమూ, విచారమూ, యేమీలేకండా, అదో యధావిధిగా, రాత్రులు కలుసుకుంటో, వేదోక్తంగా, నిష్కాములై కర్మకాండ జరుపుతో వుంటారు. ఇటువంటి దురవస్తకన్న వ్యభిచార మింకొకటిలేదనీ, మృగాన్ని చూసి, సంతోషించే మృగం, వేశ్యనుచూసి ఆనందించే విటుడి సంబంధం దీనికన్న చాలా వున్నతమూ సహజమనీ గుర్తించే స్థితికి ప్రజలు యెప్పుడు వొస్తారోకదా !

నిజమైన ప్రేమవుంటే అదెన్నడూపోదనీ, యేమిచేసినా సరే, యెటువంటివారైనాసరే, యెన్నాళ్ళైనాసరే, యెట్లా వుప యోగపరిచినాసరే పోదనీ సామాన్యాభిప్రాయం. ఇది గొప్ప పొరబాటు. అసలు సాధారణంగా యీ దంపతులకి కామం తప్ప ప్రేమ వుండనేవుండదు. వీరు ప్రేమ అనుకునేదంతా కామమే. మోహంకూడా చాలామందికి కలగదు. ప్రేమ కలగడానికి కారణాలు తెలీడం కష్టంగాని, ఒకసారి కలిగిం తర వాత నశించడానికి కారణాలు అనేకం.

ఆదర్శమైన ప్రేమ అదెన్నడూ పోదేమోగాని, సాధారణ మనుష్యులలో వుండేది ఆ ఆదర్శమైన ప్రేమకాక, వారి స్వభా వాలవల్లా, లోపాలవల్లా, సంకుచితమైనది కావడంవల్లా,

మోహాన్ని, కామాన్ని ప్రేమఅని అనుకోవడంచేతా, జాగ్రత్త పడలేకపోయినట్లైతే పరస్పరాకర్షణ చాలా త్వరలో నశిస్తుంది.

1. భార్యాభర్తలకి మొదట కొత్తలో కామం విస్తారంగా వుండడంవల్ల, ముందు వెనక ఆలోచించక అన్నివేళలా, విస్తారంగా కలుస్తోవుంటారు. ఈ దంపతులు అందుకు తప్ప ఒకరికొకరు వుపయోగించరు. ఆ విధంగా తప్ప ఒకరినించి ఒకరికీ ఆనందం వచ్చే మార్గంలేదు, గనక యింక వారికి పనిలేదు, గతిలేదు. కాని అట్లాంటి సందర్భంవల్ల ప్రేమ త్వరలో నశిస్తుంది. ప్రేమ నిలవాలంటే నూతనత్వం చెడకూడదు. ఒకరికొకరు సాధారణమూ, అలవాటూ, పాతా, కాకూడదు. ఒకరి పలుకు, తలపు, యింకోర్ని పులకరింపచెయ్యాలి. అందుకోసం అమిత నిగ్రహం కలిగి, ఆనందాన్ని కొంచెం కొంచెంగా, పువ్వునించి వాసనవలె గ్రహించాలి. ఒకరి దేహం ఒకరికి ఆశ్చర్యమూ, ఆనందమూ, ఎప్పుడూ కలిగించాలి. నిగూఢమై, అద్భుతమై వుండాలి. సౌందర్యంమీద ప్రేమ ఆధారపడదని మతాభిమానులెంతచెప్పినా, అంధులకూ, అందంఅంటే అర్థంకాని పశువులకూ, తప్ప, తక్కినవారి ప్రేమ, కొద్దో గొప్పో అందాన్ని ఆశ్రయించివుంటుంది. కనక యిద్దరూ, ముఖ్యం స్త్రీ తన సౌందర్యాన్ని కాపాడుకోవాలి. స్త్రీ శరీరం తనదికదా, తనకి చిక్కిందికదా అని పురుషుడు నలిపి, పాడుచెయ్యకూడదు. స్త్రీ అందుకు వొప్పుకోకూడదు. వొప్పుకున్నదా, త్వరలోనే, యితర స్త్రీలను పురుషుడు వెతుక్కుంటాడు. పెళ్లి అయింది కదా, యింక తన భర్త కాళపోడుకదా అని తను తన అందంచేత

గాని, బట్టలచేతగాని, శృంగారంచేతగాని, ఆకర్షించడాని కేమాత్రమూ శ్రమపడదు. పురుషుడు అంతకన్నానూ.

పురుషుడికి, స్త్రీ శరీరం తాకితే అపవిత్రమౌతుందేమో అన్నంత సుందరంగా కనపడాలి. మోకరించి భక్తితో పూజించగల రసజ్ఞతా, సౌందర్యారాధనా వుండాలి.

ఎప్పుడూ మారుతో కొత్తరకాల, భర్త హృదయం దినదినమూ నూతనంగా ఆకర్షించి జయించే నేర్పు వుండాలి స్త్రీకి. స్వతస్సిద్ధమైన అందంకన్న యీ జీవకళ, యీ నేర్పు అతి ముఖ్యం పురుషుడి మనసును ఆకర్షించడానికి. ఎప్పటికప్పుడు తన లోకానుభవంచేత, తన బట్టలు ధరించే విధం, పాపిడి తీసుకునే తీరు, కళ్ళచూపుల నేర్పరితనం, వొంటి విరుపులు, మాటల మాధుర్యం, కంఠపు మార్దవత్వం, అన్నీ Study చేసి, నేర్చుకుని వుపయోగించాలి. ఇదంతా వేశ్యాత్వమంటారు. ప్రేమ లేనిదే యివన్నీ చూపడం వేశ్యాత్వంగాని, హృదయమిచ్చిన వాణ్ణి రంజింపచెయ్యడానికి పూనుకోడం యేమాత్రమూకాదు. వేశ్యాత్వమని మానుకొన్న నిర్భాగ్యుల్ని వొదిలి, భర్త ఇవన్నీ వుపయోగించే వేశ్యదగ్గిరే చేరతాడు.

పువ్వులు, అత్తరులు, సంగీతం, నాట్యం, నగలు అన్నీ ఆకర్షణకి తోడ్పడాలి. తననేకాక, లోకాన్నే సమ్మోహింప చేస్తోందా అన్నట్టుండాలి భర్తకళ్ళకి.

ప్రేమ కొత్తలో, యేమాటలచేత, చూపులచేత, నవ్వులచేత భర్తని వశ్యంచేసుకుందో, ఆ చేష్టల్ని జీవితంలో యెన్నడూ మరవకూడదు.

భార్యాభర్తలు ఒకరికొకరు అన్ని అవస్థల్లోనూ కనపడి అసహ్యం కాకూడదు. ఒకరి శరీరం ఒకరికి కొత్తగా ఆకర్షకంగా వుంచుకోవాలి. ఎవరి బాధ్యతా ఖర్చూ వారు వహించి, వేరే యిళ్ళల్లో కాపరముండి, అవసరమైనప్పుడు కలుసుకోడం వుత్తమం.

ఒక్కొక్కప్పుడు భార్య కాపరజీవనానికి తయారై వుండదు. సిగ్గుపడుతుంది. లేక భయపడుతుంది. అసహ్యపడుతుంది ఆమె అసహ్యాన్ని అర్థంచేసుకొని ఓపికపట్టి, జాగ్రతగా, నాజూకుగా, పురుషుడు ఆమెతో పరిచయం చేసుకోవాలి. స్వార్థపరుడై పశువువలె ప్రవర్తించాడా, అతనిమీద ఆమెకెంత ప్రేమవున్నా, అదంతా భయంగా ద్వేషంగా మారవచ్చు.

పురుషుడివల్ల తృప్తిని పొందనిస్త్రీ, నరాలసంబంధమైన రోగాల పాలపడుతుంది. ముసలివాళ్ళ పడుచుభార్యలకి వొచ్చే హిస్టీరియా, పిచ్చి, భూతాలూ, ఆత్మహత్యలూ, మొదలైన వాటికన్నిటికీ యిదేకారణం. డాక్టర్లకు యీ సంగతి తెలీదు, తెలిసినా చెప్పరు. చెప్పినా ప్రజలువినరు. కనక భార్యకు సంతృప్తినిచ్చే చాతుర్యాన్ని నేర్చుకోవాలి భర్త. యిది సులభమైనపనికాదు. స్త్రీకి 'ఆర్గాజమ్' వుంటుందని తెలియని భర్తలెందరోవున్నారు. తమకి అదివుంటుందని తెలీని భార్యలెందరోవున్నారు—పదిహేనేళ్లు కాపరాలు చేసి, పది మంది పిల్లల్ని కన్నవారుకూడా. పురుషుడి ఆనందానికి స్త్రీ సృష్టింపబడ్డదనే అనేక స్త్రీ పురుషుల వూహ. స్త్రీ ఆందంతో పురుషుడికి పనిలేదు. ఆయనగారికి తృప్తి కలిగితేచాలు స్త్రీతృప్తినిగురించి ఆలోచించేభర్తలు అరుదు.

స్త్రీని తృప్తిపరిచేందుకు ఆరోగ్యమూ, బలమూ అవసరములే గాని, అంతకన్న చాతుర్యము ప్రాముఖ్యము. దీనిలో మనసు Influence చాలావుంటుంది. పురుషుడు ముఖ్యంగా తొందరనూ, ఆత్రతనూ మాని నెమ్మదిగా, తన మనసునూ, శరీరాన్ని, స్వాధీనములో వుంచుకుని, ఆనందాన్ని వీలైనంత కాలము ఎక్కువగా అనుభవించాలి. చాలా స్వార్థ సిగ్గువిడిచి స్త్రీని ఆమెకు ఆనందము కలుగుతోందో లేదో, ఏ విధంగా ఎక్కువ ఆనందం కలుగుతోందో, తృప్తి కలిగిందో కనుక్కుంటో వుండాలి. పురుషుడి కన్న స్త్రీకి తృప్తి ఆలస్యంగా కలుగుతుంది. ఊహామాత్రంగా పురుషుడు సన్నిద్ధుడు కాగలడుగాని, స్త్రీ చాలాకాలము తీసుకుంటుంది. నేర్పరీ దయాళుడూ ఐన పురుషుడు, తన మనసునూ కుతూహలమునూ అణచిపట్టి పరి పరి విధముల స్త్రీని ఉద్రేకింపచేస్తాడు. ఆ విధాలు సృష్టే నేర్పుతుంది. ఏ కామశాస్త్రములో చూసినా అతి నేర్పుతో, సయన్టిఫిక్ ఎనాలిసిస్ (scientific analysis) తో చేయబడ్డాయి ఆ వర్ణనలు. కనక ప్రత్యేకం వ్రాయనక్కర్లేదు.

వీర్య స్తంభనకు మందులనేకము లమ్ముతున్నారు. వాటి ఉపయోగము నాకు తెలీదుగాని, అవి ఎక్కువ ఉపయోగకరము కావనీ, శక్తిహీనులకేగాని, ఆరోగ్యవంతులకు సహాయమక్కర్లేదనీ, మందులు సహాయకారులు కావనీ, ఆ నిమిషాన కొంత సహాయంచేసినా, ఆరోగ్యానికి ప్రతికూలములనీ, కొన్ని హానిని చేస్తాయనీ నా వుద్దేశ్యము. ఈ వుద్దేశ్యము తప్పుకావొచ్చును. పూర్వము యోగులు సాధనవల్ల వీర్య స్తంభనము చేసేవారని ప్రతీతి. ఒకవిధమేమంటే ఆసనము బిగపట్టడం. ఆ బిగపట్టడం

ఇచ్ఛా స్వాధీనముచేసి, ఎంతకాలమైనా అలాగుననే వుంచగలిగితే వీర్యస్తంభన కుదురుతుంది. అంతవరకు వాస్తవంగా కనపడు తోనేవుంది స్వానుభవంలో. కాని ఆ స్వాధీనం కుదిరేందుకు కొన్ని సాధనలు చెపుతారు. అవిమాత్రం 'ప్రాక్టికల్' గా కనపడవు. కావలసినవారు యీ విషయమై 'గాంబర్సు' గారి పుస్తకాలు చదువవచ్చును. కాని ఆ స్వాధీనం చేతకావడానికి కావలిసిన యోగసాధన చేసేప్పటికి, యీ విషయాశక్తి అసలే తప్పిపోయి యోగమార్గంలో పడతారేమో ననుకుంటాను.

భార్యాభర్తా వివరంగా యీసంగతులు మాట్లాడు కోరు. ఒకరిస్థితి ఒకరికర్థంకాదు- ఒకరిని సంతోష పెట్టడ మెట్లానాఅని రెండోవారు ఆలోచించరు. పురుషుడు స్త్రీని సంతృప్తిపరచకపోతే, ఆవిషయమై స్త్రీమాట్లాడదు. తన బలాన్ని వొప్పుకోడం ఆమెకి అభిమానం. అసలు తనకి కామం వుందనీ, వుండడం సహజమనీ, అనుకోడమే ఆమెకి అవమానం. తనకి అంతకోర్కెవుండడమే పాపమనీ, నీచమనీ, ఆమెఅభిప్రాయం. యీ అన్యాయం విద్యలోనూ, చాతుర్యంలోనూ, లోపమని యిద్దరికీ తెలీదు. తెలుసుకోడం బూతు. సకలమైన బూతు తిట్లూ తిట్టవొచ్చుగాని, శుభ్రంగా, నిష్కపటంగా, మాట్లాడ కూడదు — యీవిషయాలు. యిట్లా కష్టపడి, తృప్తినెరగక, ప్రేమచచ్చి, కుళ్ళడం, నీతి. అదిగాక చిన్నప్పటినించీ ఆకార్యం దుర్నీతి అనీ అసహ్యమనీ, రహస్యమనీ, నీచమనీ, సూచించడం వల్ల స్త్రీలు విజృంభించి, తాము స్వతంత్రితపూని, పురుషుడికి ఆనందమియ్యరు. తాము అనుభవించరు. అతనేంచేసినా, జడుల వలె, లొంగివుండడమే, ధర్మమనుకుంటారు. తమకు యిష్టం

లేనప్పుడు నిరాకరించేశక్తినీ, తమకు అక్కరవున్నప్పుడు సుఖాన్ని స్వీకరించే స్వతంత్రాన్ని పోగొట్టుకున్నారు. పూర్తిగా వయసు వొచ్చినస్త్రీకి కోర్కె ముదర్శకపూర్వమే, బాలికలనే, యీ భర్తలు బలాత్కరించడంవల్ల, స్త్రీలు విముఖులౌతారు.

ఈవిధంగా స్త్రీని నొక్కిపట్టడంవల్ల, స్త్రీ సౌఖ్యాన్ని చెడకొట్టడమేగాక, స్వతంత్రించి సౌఖ్యాన్ని కోరే స్త్రీ పురుషుడికి యివ్వగల మహదానందాన్ని కూడా పురుషుడు నాశనం చేసుకున్నాడు. అందుకునే పురుషుడుకి భార్యకంటె వేశ్యని చూస్తే యిష్టం. వేశ్య నెరిగిన పురుషుడు తిరిగి భార్యముఖం చూసేవాడెంత దౌర్భాగ్యుడై వుండాలి? వేశ్య స్వేచ్ఛగా తనవృత్తికోసం కామరహస్యాల్నీ, రసత్వాన్నీ, రతిపద్ధతుల్నీ, కొంచెమో గొప్పో నేర్చి వుంటుంది. పురుషుణ్ణి ఆకర్షించడమే ఆమె వుద్దేశ్యం. బిడియంలేదు. ఆ ఆకర్షణాప్రయత్నాలు చెయ్యక, చెయ్యడం చేతకాక, పురుషులు దుర్మార్గులని, స్త్రీలు యేడిస్తే యేంలాభం? వేశ్యను ధిక్కరించగల మాధుర్యాన్నీ, భావప్రకటననూ, ఆకర్షణాన్నీ భార్య సంపాయించాలి. రోజూ కొత్తగా అతనిమనసును కొత్తరకాల జయించి కట్టివేసుకోవాలి. ముందు యింటివద్ద తలిదండ్రులైతే యీ నేర్పరితనాన్ని నేర్పాలి. తరవాత భర్త అభివృద్ధిపరచుకోవాలి. స్వతంత్రగా స్త్రీ నేర్చుకోవాలి. పురుషుడు ప్రౌఢస్త్రీల నెరిగినవాడై వుండి, నేర్పరై వుండి, తనభార్య కూడా తనకి అంత ఆహ్లాదమూ, సంతృప్తి కలగచెయ్యాలని ఆశపడతాడు. కాని యీపెళ్ళికూతురికి సరిగా ముద్దుపెట్టుకోడం చాతకాదు. కొత్తలో ఆముగ్ధత్వం సొగసుగానే వుంటుంది. కాని,

అది మొన్నాళ్ళకీ జాణతనంలోకి మారక, ముద్దుతనంగానే వుంటే విసికి, ఆమెని వంటకి మాత్రమే వుపయోగిస్తాడు పురుషుడు.

భర్త ప్రేమని ఆకర్షించి నిలుపుకోడ మెట్లానో, తన అందాన్నీ, శరీరాన్నీ కాపాడుకోడ మెట్లానో, ఆడపిల్లలకి తల్లులు నేర్పాలి. స్త్రీకి పురుషుడి మోహాన్ని ప్రేరేపించే పద్ధతులు, కాలం వొచ్చేటప్పటికి స్పష్టే నేర్పుతుంది. కాని పెద్దవాళ్ళు తిట్లతోనూ, నీతిబోధనలతోనూ, వాటిని నాశనంచేసి, అనాధలనూ, అవివేకులనూ చేస్తారు.

"స్త్రీని తన చేతుల్లో కావిలించుకుని అనుభవిస్తో కూడా యింకా ఆమెని తీవ్రంగా వాంఛించే పురుషుడే ఆమె దేహాన్ని కామానికే కాక, కవివలె, రసజ్ఞుడివలె, ఆమెలో, ఆమె శరీర సౌందర్యంలో, మనోలావణ్యంలో, పరవశత్వం పొంది, ఆ ఆనందాన్ని, తన కళ్ళల్లో, మాటల్లో, స్పర్శలో, చూపగలవాడే, స్త్రీని నిజంగా, లాలించి, సంతోషపెట్ట గలవాడు." (ఎడ్వర్డు కార్పెంటర్)

స్త్రీ ప్రేమను నిలుపుకునేందుకు పురుషుడూ యింత జాగ్రతా పడాలి. ఆమె ప్రేమని ఆకర్షించే లక్షణాలు వేరు. ఆమెవలె నగలూ, దేహాలంకారమూ అవసరములేదు. కాని శుభ్రితా-చురుకుదనమూ అవసరము. తన మాటలు, గుణాలు, ధైర్యము, లోకజ్ఞానము, పాండిత్యము, మొదలైన గుణాలు ఆమెకోసమన్నా అలవరచుకోవాలి.

పూర్వంనించీ మనదేశంలో బంధనాలు అమలులో వున్నాయి. సాధారణంగా ప్రతియింటోనూ యీబంధనాలూ, స్త్రీలక్షణాలూ, మందులూ, మంత్రాలూ, మొదలైనవి కలిసి

వున్న అచ్చు ప్రతి ఒకటి వుంటోనే వుంది. ఆ పుస్తకాల్లో చెప్పిన మందులూ మంత్రాలూ అసాధ్యాలూ, హాస్యాలుగా వుంటాయి చాలామట్టుకు. కాని ఎక్కడో వాస్తవమైన రహస్యాలు వుండవొచ్చు. వాటి నిజం పరీక్షించడానికి కృషి చెయ్యవలసిందే! స్త్రీపురుష లక్షణాలు తెలుసుకోడం కూడా ప్రస్తుతకాలంలో వుపయోగకరమైనదే కదా! ఇవేగాక, కొన్నిపుస్తకాల్లో, కామసంబంధమైన కార్యాలన్నీ విడతీసి, ఛేదించి, అన్నిటికీ పేర్లుపెట్టి విశదీకరించారు. ఇవన్నీ రసజ్ఞులకు స్వభావసిద్ధంగానే చాతనౌతాయి. అదిశాస్త్రం. అంతేగాని అనుష్ఠానానికి యెక్కువ సహాయం చెయ్యదు. వ్యాకరణం ముందు నేర్చుకుని అటుతరవాత ఆప్రకారం మాట్లాడాలని ప్రయత్నించే మూర్ఖుడుంటాడా? కాని మొత్తానికి ఆపుస్తకాలు చదవడంవల్ల కొన్ని కొత్తవిషయాలు, గోచరించక మానవు.

బంధనాలు, వాటిలో ముఖ్యమైనవి. ఆవిషయమై శ్రద్ధ వహించే వాడికి చదవకండానే అవన్నీ స్వతంత్రంగానే మనసుకి తట్టినా, అన్ని విశేషాలూ, తెలీకపోవచ్చును. అదిగాక సిగ్గువల్లా, బద్ధకంవల్లా, మామూలుకావడంచేతా పరలోక వాసనవల్లా, నిరాశతోటీ ఆ విషయమై పరిజలాలోచించి సాధకం చెయ్యరు. వారంతట వారు ప్రయత్నంచేసి కనుక్కొని, సుఖ పడరు. అట్లాంటప్పుడు, యీ పుస్తకాలు చదవడంవల్ల సుల భంగా, చతురత్వమూ, 'variety' చాతనౌతాయి.

వాటిలో కొన్ని బంధనాలు నేర్చుకోడం చాలా కష్టంగా కనపడుతుంది. గురువులు అవసరంగా తోస్తుంది. కొన్నిటివల్ల, యిన్ని బంధనాలు వొచ్చుననే సంతుష్టి తప్ప, యితరంగా

వాస్తవమైన సుఖమేమీ కనపడదు. కొన్ని, మార్పు (వెరయిటీ) కావడంవల్ల, విసుకును తగ్గించి ఆనందాన్ని హెచ్చిస్తాయి. అదిగాక వ్యక్తిభేదాన్నీ, శరీరభేదాన్నీ పట్టి కొందరు కొందరికి ఒక్కొక్క బంధం వుపకరించవచ్చు. ఈ విషయాలు అచ్చువేసి అమ్మకూడదని శాసనము; కాని యీజ్ఞానం సర్వత్రా వ్యాపించడమే శ్రేయోదాయకమని నా నమ్మకం. స్త్రీ పురుషులు పరస్పరం ఆకర్షించే పద్ధతులూ, రంజింపచేసే సూత్రాలూ, కొన్నిట్లో బాగా వ్రాశారు. ఈ విషయంలో స్వతంత్రయోచన తక్కువైన వారికి చాలా వుపయోగం. ఈ బంధనాలు మొదలైనవి జీవితంలో అమలులోకివొచ్చి, ప్రజలకు వుపయోగపడాలంటే, పునస్సంధానానికి పూర్వమే పిల్లల్ని యీ విషయాల్లో పండితుల్ని చెయ్యాలి. ఇంగ్లీషూ, కుట్లూ, హార్మోనియమూ నేర్పుతారుగాని, రసజ్ఞతా, రుచిగల వంటా, గదిలో నేర్పూ, జాణతనమూ, నేర్పరుకద! ఈ విషయాలు నేర్పే గురువులు వుండాలి. కాలేజీలు స్థాపించాలి. పోనీ, సమర్థులూ, అనుభవజ్ఞులూ ఐన వేశ్యలు, యీ విషయాలు నేర్పడానికి 'బోర్డు' కట్టుకోకూడదా? అన్నట్టు వాళ్ళకీ పెళ్ళిళ్లుచేసి, మతిహీనుల్నీ రసహీనుల్నీ చేస్తున్నారుకద!

చీకటీ, మురికీ, యిరుకూ, మోహాన్ని చంపుతాయి. కనక దంపతులు, ముఖ్యంగా స్త్రీ యింటో బంధితులు కాకూడదు. గదుల్లోదూరి, రాత్రనక, పగలనక, తలుపులు వేసుకోడం మానెయ్యాలి. మిగిలిన జీవితం యెక్కడ గడిపినా, కామజీవనం మాత్రం సుందరప్రదేశాలలో గడిపితీరాలి. సుందరభావాలతో ఆకాలాన్ని నింపుకోవాలి. కాని సంసారం యీ ఆనందానికీ

సౌందర్యానికి గర్భశత్రువయింది. సాధారణంగా మనుషులు గడిపే సంసారజీవనం యెట్లావుంటుందో చూద్దాము. కొత్తగా దంపతులు కాపరం మొదలుపెట్టినప్పుడు, యెంతో రసహృదయాల్లో వుండడంవల్ల బాహ్య పరిస్థితులను అందంగా వుంచడానికి శ్రమపడరు. కొందరు ప్రయత్నించినా, పరిస్థితులు అనుకూలించవు. గదులు సాధారణంగా యిరుకుగా చీకటిగా వుంటాయి. వాటిలో ప్రవేశిస్తేనే వున్న వుత్సాహమంతా చస్తుంది. దానినిండా సామాను, బూజు, పెద్దబరువైన మంచం. అదిగొప్ప. దానిమీద పీచుపరుపు, దోమలూ, చమటా, పాతపరాలు. యిట్లా ఏడుస్తాయి గదులు. కిటికీలు రోడ్డుమీదికి వుంటాయి. తెరిస్తే ప్రమాదం. పక్కగదిలో యింకా యెవరో దంపతులు వుండడంవల్ల బిగ్గరిగా మాట్లాడడమూ, నవ్వడమూ భయం.

అప్పటికీ పాపం యేవో ప్రయత్నాలు చేస్తారు. జీవితం అందంగా చేసుకోడానికి ప్రయత్నిస్తారు కాని ఆ ప్రయత్నాలు చూస్తే జాలి నవ్వూవే కలుగుతుంది. ఒక్క యేడాదిలో బిడ్డ కలుగుతుంది. కలిగేటప్పుడు చాలా వుత్సవాలు చేస్తారు. సంతోషిస్తారు. కాని ఆగర్భంతోటే ప్రేమ చచ్చిందని అర్థం చేసుకోరు. ఆ చిన్నతనంలో యీ బలహీనురాలైన తల్లి కనడంతోటే, వున్న అందంపోయి, వొళ్ళంతా జావలాగు వేళ్లాడి, యెటువంటి తుచ్ఛులూ కన్నెత్తిచూడలేనంత, వికారరూపాన్ని ధరిస్తుంది. అటుతరవాత బిడ్డలయేడుపుల్లో, వుచ్చవాసనలలో, భార్యాభర్త కడుపునిండా తిన్న ఆ పులుసుకూర కంపే కొడుతో, భర్త ఆఫీసు పాతరికార్డు వాసనవేస్తో, భార్యయింగువ వాసనేస్తో అదో కర్మకాండకింద, ఆతిన్న మిరపకాయలకారమూ,

ఆవా, ప్రేరేపించగా, అదో యధావిధిగా, సంతోషమూ, విచారమూ, రెండూలేక, కళ్లుమూసుకుని, ఒక్క నిమిషములో, యేమీ ఉపోద్ఘాతమన్నా లేకండా, ఔషధం మింగినట్టు నిష్కామ కర్మకాండ జరుపుతారు. ఒకరి దేహం చూచుకోడానికి ఒకరికి రోత. అందుకు దీపంకూడా ఆర్పుతారు. ఒకరితో ముద్దుగా మాట్లాడ్డానికి ఒకరికి మాటలు లేవు. ఒకరిని చూస్తే ఒకరు భరించలేరు. అంతకు ముందే పోట్లాడుకుంటూ, చీదరించుకుంటూ వుంటారు. ఇంతలో పిల్లలులేస్తే కొడతారు. ఆరోగ్యాలు చెడడంవల్ల దేహములోని మురికివాసనలు. ఆసమయమే భార్యకు తన ఆధిక్యత చూపడానికి వీలు. నగలకోసమో, లేక చీరల కోసమో, ముందే వాగ్దానాలు చేయించుకోవాలని ప్రయత్నం. కాని, భర్త చిక్కుతాడా? ఇదీ ఆధ్యాత్మికమైన సంసార సుఖం.

పాపం కొంచెం 'రొమాన్సు' రసజ్ఞతా గల మనుషులు యీకక్కుర్తినించి బైటపడే వుపాయంలేక యితర స్త్రీ పురుషుల్ని వెతుక్కుని ఆనందించడానికి ప్రయత్నిస్తారు.

ఆరోగ్యవంతులైన స్త్రీ పురుషులు వెన్నెలరాత్రుల సముద్రతీరాల, నదీతీరాల, చల్లగాలిలో, తెల్లని యిసికమీాద, నీళ్ళచప్పుడులో లేక అందమైన అడవులలో, పచ్చికబయళ్ళమీాద తమ సుందరదేహాన్ని దాచుకునే అవసరమూ అసహ్యమూ లేక, జతలుగా, విహరిస్తో, ఆడుతో, పాడుతో, నవ్వుతో, స్వేచ్ఛగా నిర్మలాకాశముకింద, పువ్వులవాసనలో, భూమే శయ్యగా, తిరిగి, కలుసుకునే, అదృష్టం యెప్పుడు కలుగుతుందోకదా! ఈ మందులూ, కషాయాలూ, చమటా, రహస్యమూ, అంద వికారమూ, తొందరా, బలహీనత్వమూ, తిండివల్లా, బట్టలేని

బొమ్మలవల్లా, కలిగే కుహనాడంబరాలు తేకమూ, దొంగమాటలూ, అనుమానాలూ, ఆగ్రహాలూ, నీరసాలూ, యెప్పటికి పోతాయో! అసలు పోనే పోవో?

భార్యాభర్తలు పొద్దున్నా సాయంత్రమూ, వెన్నెల్లోను, చల్లని శుభ్రమైన గాలిలో షికార్లుపోవాలి. ఆటలాడాలి, పుస్తకాలు చదవాలి, క్లబ్బుల్లో, సొసైటీలలో మెంబర్లై ఎవరి పనుల మీద వారుండాలి. అనేక సిట్యుయేషన్లలో పరిచయములు కావాలి. అనేకమంది స్త్రీ పురుష స్నేహితులతో కలవాలి. తామే లోకంలోకల్లా ఒకరికొకరనుకొని యిద్దరూ ఒకరినొకరు చూచుకుంటూవుంటే, యింక త్వరగా ఒకరినొకరు యెన్నడూ చూచుకోడానికి యిష్టములేకుండా ఐపోతారు. మొదట్లో ఒకరికి ఒకరం చాలమూ అనిపిస్తుంది. గాని, ఆ యభిప్రాయాన్ని నమ్మితే చాలామోసం. అనేకపనులలో ధ్యాసలలో కాలం గడిపి, కామం మరచిపోవాలి. ఇతరుల్ని తనయింటికి పిలవాలి, తామితరులయిళ్ళకు వెళ్ళాలి. కామంవల్లగాక యితరవిధాల ఒకరినించి ఒకరు ఆనందంపొందే పద్ధతులు తెలుసుకొని అనుభవించాలి. కవిత్వం, సంగీతం, కళాభిరుచి, సృష్టిసౌందర్యం, గ్రంథపఠనం, వీటిలో ఐక్యం కావాలి. ఒకరినొకరు చూస్తే చాలు, వేలుతాకితేచాలు, పరవశమయ్యేట్టు మనసుని వుంచుకోవాలి. అప్పుడప్పుడు ఒకరినొకరు వదిలి, మళ్ళీ కలుసుకోడం మంచిది.

ఈ కాలపు నాగరిత పొందిన ప్రజలకు అసహజమైన కామరోగం పట్టుకుంది. స్త్రీ పురుషు లింతగా గదుల్లో దూర

డం సహజమూకాదు, ఆరోగ్యమూ కాదు. స్త్రీ ధ్యాసలేనిదే ఆరోగ్యవంతుడైన మనిషికి యెన్నిసార్లా కోర్కె కలుగుతుంది ? చాల తక్కువసార్లు. భోజనమువల్ల, మాటలవల్ల, తలపులవల్ల, కథలవల్ల, నాటకాలవల్ల, బయస్కోపులవల్ల, అసహజంగా యీ వాంఛని వృద్ధిచేసుకుంటున్నారు. స్త్రీ దగ్గరవుండగానే, ఆకోర్కె సహజంగా కలగకపోయినా, అనేక కృత్రిమ విధాల ప్రేరేపించు కుంటున్నారు. భార్య ఐనంతమాత్రాన, ప్రతి రాత్రీ వుపయోగించడం ధర్మమూ, హక్కూ అనుకుంటున్నారు. స్త్రీ యింకా పురుషుడంత నాగరికతా ప్రవాహంలో పడకపోవడంచాత యీ నిత్యకామ జీవనానికి యిష్టపడదు. కాని విధిలేక పురుష ప్రభు శాంతికోసం దేహం వొప్పచెపుతోంది. 'అప్‌కోర్సు' అసహజమైన వాంఛగల స్త్రీలూ లేకపోలేదు. ఇంక మితిమీరి కామ వాంఛ దానంతటదే అది కలిగినప్పుడు తీర్చుకోవలసిందే! కాని కాఫీహోటలుచూస్తే ఆకలి కలిగినట్టు, యీ వాంఛను అసహజం చేసుకోకూడదు.

ఈ స్థితికి యింకో కారణం. ఈ దుస్తులలోనూ, చూపులలోనూ, సిగ్గులలోనూ ఆకర్షణ. స్త్రీని యిట్లా దాచి, రంగు చీరలు కట్టి, జుట్టు పెంచి, పూలు పెట్టి, అలంకరించి, సిగ్గు చూపులూ, దాక్కోడాలూ, బలహీనత్వమూ, అచలత్వమూ, యివన్నీ లేకపోతే యింత వాంఛ వుండదు. పడకగదుల్లో తమ ప్రియులకి ప్రేమ సమయంలో చూపవలసిన అందాలనూ, మర్యాదలనూ, జాణతనాలనూ, వీధిగుమ్మాల్లోనూ, తెరచాటులా, వీధులవెంబడీ, ప్రతిపురుషుడికీ, చూపుతున్నారు ధర్మపత్నులు. భర్త అతి సమీపవర్తి ఐనప్పుడు చూపవలసిన

సిగ్గును, ప్రతి పరపురుషుడియడలా చూపడమెందుకు? 'అదుగో నన్ను బలాత్కరించబోతున్నావు' అది నా భర్త వొప్పుకోడు, అన్నట్టు ప్రవర్తిస్తారు. పురుషుణ్ణి చూడగానే గుమ్మాలవెనక దాక్కోడం అర్థమేమిటి? సిగ్గుపడే ప్రతి స్త్రీ sub - conscious గా వ్యభిచారి. లేకపోతే ఆ దొంగభయ మేమిటి? ఇదంతా ఆకర్షణకు ప్రథమ సోపానము. ఈ పతివ్రతలు బహిరంగంగా (conscious level) లో నించి తొక్కిపట్టిన 'రోమాన్సు' "subconcious" ఫలమిది.

ఇంకొకటి. దంపతులు, విద్యవల్లనేమి, సంస్కారమువల్లనేమి లోకజ్ఞానమువల్లనేమి, చాలాభేదం కలిగివుండి, ఒకరిలో ఒకరికి యీ సంబంధంతప్ప యింకేమి చాతగాకపోవడమువల్లా, తెలివి తక్కువవల్ల వున్న ఆనందాన్ని రసజ్ఞతను చంపుకోవడంవల్లా, మోహం పోయిన దంపతుల్ని సంఘం బలవంతంగా బంధించి వుండడంవల్లా, ఆ కార్యంవల్ల తప్ప యింకో విధంగా యే ఆనందాన్ని పరస్పరంగా పొందడం చాతగాక, యింక వేరు గతిలేక, యీ వాంఛని పెంచుకుంటారు. ఇష్టంలేనప్పుడు, అసహ్యించుకుంటున్నప్పుడుకూడా, విధిలేక కలుస్తారు. ఒకరు రెండోవారి దగ్గిరిగా వుండడమే, ఒకరినొకరు చూడ్డమూ, మాటలే, ఆనందమిస్తే యీ జాడ్యం తగ్గుతుంది. సంగీతం, సంభాషణ, రసికత్వం, వివేకం లోకజ్ఞానంవుండి, స్నేహమూ, ప్రేమా కలిగి, సంసారంలోనేగాక, లోకంలో యిద్దరూ సహచరులు కాగలిగినట్లయితే, ఆ సౌఖ్యంలో, ఆ మాధుర్యంలో, పడకటింటి తాత్కాలికసౌఖ్యం, ఒక గొప్పదిగా కనిపించదు.

అధికమైన స్నేహం కలిగినప్పుడు యిద్దరు మగస్నేహితు లయినా, కొన్ని సమయాల్లో ఒకరినొకరు బుజ్జగించుకుంటారు. ఎట్లాగన్నా యింకా ఆత్మీయమైన సంబంధం కుదరాలని ఆశ పడతారు. (అదీ అనేకమంది జీవితాలలో యీ అనుభవమూ వుండదేమో!) ఆవిధంగానే స్త్రీపురుషులు స్నేహితులై, లోకంలో జీవించేప్పుడు అన్ని విషయాల్లోనూ ఒకరి కొకరి సలహానిచ్చుకుంటో సహాయంచేస్తే, అనుభవాలనూ, అభిప్రాయాలనూ పంచుకునేప్పుడు, ఒకరిపైన ఒకరికి కలిగే ప్రేమవల్ల ఒక్కొక్కప్పుడు ఆకర్షణ కేంద్రీకరించి, యింకా అంతరంగికంగా ఐక్యం కావాలనే వాంఛ సకృతుగా కలుగుతుంది. అదే సహజమైన సమయము. తక్కినది వ్యభిచారము — అందులో ఆనంద మివ్వని, నీచమైన నైతిక శాస్త్రయుక్త వ్యభిచారము. అది తటాలున వాంతివలె సంభవించదు. ఎంతో ప్రేమపైన, ఉపోద్ఘాతము తరవాత భరింపలేనంతటి ఆకర్షణ ఫలము-ఆకలయికతో రెండుజీవితాలూ ధన్యములై, సంతృప్తిని పొందుతాయి.

అదిగాక వీర్యమే శక్తి. అదే మేధస్సు, జీవితంలోని వుత్సాహము, ఆరోగ్యం. దాన్ని యెంత నిలవచేసి, తన శరీర, మానసిక, అభివృద్ధికి, యెంత ఉపయోగించ కలిగితే, అంత సుందరమౌతుంది, అంత సఫలీకృత మవుతుంది జీవితము. కనక నిగ్రహము అత్యవసరము. భార్యతో జీవనంలోకూడా యెప్పుడు వాంఛను తీర్చుకున్నాడో, అప్పుడు మళ్ళీ వీర్యము కూడేవరకూ, భార్యపైన ఆకర్షణరాదు. ఆ ఆకర్షణా మాధుర్యాన్ని వ్రిజలెరుగరు కనకనే యీ విధంగా తమ శక్తి ధనాన్ని

దుర్వినియోగం చేస్తారు. కనక వీలైనంతవరకు ఆ మాధుర్యాన్ని వదలకండా పాలించుకోవాలి జీవితాల్ని.

సంపూర్ణ నిగ్రహం కలిగే వరకు వేరే పక్కలు, వేరే గదులు, వేరే యిళ్ళల్లో నివసించడం ఉత్తమం.

భార్యా భర్తలు, తమమీద అధికారం కలవారినీ, సాడీలు చెప్పేవారినీ దూరాన వుంచాలి. తల్లితండ్రులైనాసరే మంచివారు కాకపోతే దగ్గిరికి చేర్చకూడదు. పురుషుడు తన తల్లితండ్రుల పోషణకీ, సేవకీ భార్యని నియోగించకూడదు. అంత ప్రేమవుంటే తానే ఆసేవచేస్తే మంచిది. వాళ్ళ సేవ కోసం తాను అసలు పెళ్ళిమానుకుంటే అంతకన్నా మంచిది. పిల్లలు త్వరగా కలగకండా జాగ్రత్త తీసుకోవాలి. యిద్దరికి అనురాగం స్థిరమై, యింక విడిపోరని దృఢమైనతరవాతే బిడ్డల్ని కనాలి. అదిగాక త్వరగా బిడ్డలుపుడితే భార్యాభర్తల స్వేచ్ఛా, ఆనందమూ, అడ్డపడతాయి. స్త్రీ అందం చెడిపోతుంది. యీ చిన్న దంపతులు వారి ఆనందంతో వారుండడంవల్ల బిడ్డలు కూడా సరైన శ్రద్ధలేక సంకట పడతారు. పెళ్ళి కాగానే స్త్రీ తను ప్రత్యేక సంపాదన మొదలు పెట్టాలి. పురుషుడి మీద ఆధారపడ్డదా, యెంత ప్రేమవున్నా నశిస్తుంది. కుటుం బానికి యెవరెంత ఖర్చుపెట్టాలో నిర్ణయించుకోవాలి. ఒకరి నొకరు గౌరవంగా చూసుకోవాలి. 'మీరని' పిలుచుకోడం మంచిది. భార్యా భర్తా యెవరి పనులు వారు చేసుకుంటూ, వేరే యిళ్ళలో దూరంగా వుండడం మంచిది. ఒక యింటో వున్నా వేరు భాగాలలో వుండితీరాలి. ఒకరిపైన ఒకరికి సంపూర్ణమైన విశ్వాసం వుండాలి. అనుమానం కలిగిందా,

వెంటనే అడిగెయ్యడం మంచిది. ఇప్పటివలె స్త్రీ పురుషులకి వాళ్ళ నడవడి దాచుకోవలసిన అవసరం అప్పుడు వుండదు. ఇంకోరిమీద మోహం కలిగితే అబద్ధంగా ప్రవర్తించవలసిన గతి రాదు. దాక్కుని దొంగతనంగా పరీక్షించి లోపల కుళ్ళడం నీచం, ప్రేమకి విషతుల్యం. అడగాలి, లేదంటే నమ్మాలి. నమ్మకపోతే విడిపడాలి. కాని ఒకరు పరాయివారిని ప్రేమించడంతోటే తమమీద వారికి ప్రేమ పోయిందనుకో కూడదు. ప్రేమని పంచుకోడం నేర్చుకోవాలి.

పరస్పరం నిష్కపటంగా, హృదయపూర్వకంగామాట్లాడి ప్రవర్తించాలి. అబద్ధం చుట్టుపక్కల చేరనియ్యకూడదు. రెండో వారికి కష్టం కలుగుతుందే అనే వుద్దేశ్యం అడ్డం రానియ్య కూడదు. ప్రేమ నిష్కళంకంగా వుంచుకోవాలి. తన భర్త మీదగాని భార్యమీదగాని ప్రేమపోయినా యితరులమీద ప్రేమ కలిగినా, యిద్దరిమీద ప్రేమవున్నా, నిజం చెప్పాలి.

ఈ మోహ జీవనంలో అనేక విధాలైన 'మిసండర్‌స్టాండింగ్సు' వొస్తాయి. చిక్కులు పోట్లాటలు తటస్థిస్తాయి. అన్నిటినీ ప్రేమ ఆలింగనము చేసుకుని, సమర్థించాలి. ఆచిన్న యిబ్బందులవల్ల ప్రేమ పోయిందనుకో కూడదు. ఒక్కొక్కప్పుడు కొన్నాళ్ళకి, కొంచెం విసుకుకలిగి, కొంచెం మార్పు కావాలనిపించవొచ్చు. అప్పుడు తాత్కాలికంగా యింకొకరితోవుండి మళ్ళా కలుసుకోవొచ్చు. ఒకప్పుడు యింకొకరిపైని చాలా మనసు కలుగుతుంది. ఆ మనసు తీర్చుకుని, మళ్ళీ యథాస్థితిగా యిద్దరూ కాపరం చెయ్యవొచ్చు. ఒకరివల్ల ఒకరికి సంతానం కలగకండా వుంటే, మార్పువల్ల సంతానం

కలుగుతుందేమో, ప్రయత్నం చెయ్యవొచ్చు. యివన్నీ సహన బుద్ధితో ఉత్తమప్రేమతో సమర్థించుకోవాలి.

భార్యాభర్తలు ఒకరి నీతి నింకొకరిపైన విధించుకో కూడదు. అందరి స్వభావాలకీ ఒకటే నీతి సరిపోతుందనుకోడం తప్పు. హృదయపూర్వకంగా ప్రేమిస్తేనేగాని, శరీరాన్ని తాక నియ్యనివాళ్ళు కొందరు; శరీరానికీ మనసుకీ సంబంధంలేక మన సుతో పూర్ణంగా ప్రేమించికూడా, శరీరవాంఛల్ని యితర విధంగా తీర్చుకోగలవారు కొందరు; యిట్లా అనేక విధాలుగా వుంటారు. కనక యెవరి నీతికి వారిని వొదిలి, రెండోవారు తాము అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. భర్త దగ్గరలేని ప్పుడు, భర్త సంపూర్ణమైన తృప్తిని గలిగించనప్పుడు, శరీర వాంఛ తీర్చుకోడం కోసం నౌకర్ని జీతాని కేర్పరుచుకున్నా భర్త అర్థంచేసుకుని ఆమె నీతి అభిప్రాయాలతో సానుభూతిని చూపే ఔదార్యం కలిగివుండాలి. యిట్లాంటి సూక్ష్మభేదా లనేకములుంటాయి. ముఖచిన్హాలలో, కంఠస్వరాలలో యిన్ని ప్రత్యేక భేదాలున్నప్పుడు, స్వభావాలలో యెంత భేదముం టుందో ఆలోచించుకోవొచ్చు.

ముఖ్యం యీ సమస్యలన్నీ పరిష్కారం కావడానికి స్వార్థత్యాగం కావాలి. అన్ని విషయాల్లో త్యాగం బోధిస్తారు గాని, యీ విషయంలో వొప్పుకోరు. నిజమైన ప్రేమగలవారే ఐతే, తప్పకండా భార్యలూ, భర్తలూ, రెండోవారి సౌఖ్యమూ, ఆనందమూ, విచారించాలి. భర్తకి సౌఖ్యమివ్వలేనప్పుడు, భార్య ఇంకో వివాహం అతన్ని చేసుకోమంటే, 'ఎంత పతివ్రత అమ్మా' అంటారు. భర్త భార్యకే అట్లాంటి వీలు కలగచేస్తే

ఆకాశం విరిగి నెత్తిన పడుతుంది. జంకక, రెండోవారి తృప్తికి, ఆనందానికి, ఎంతత్యాగాన్నైనా చెయ్యగలిగిందే వున్నతమైన ప్రేమ. యిట్లా సౌఖ్యపడే విధాలు బోధించే మాటలన్నీ చూస్తే ప్రజలకి, ముఖ్యంగా యీ దేశపు ప్రజలకి కోపం. యిదంతా స్వార్థమనీ, తమ ఆనందాన్ని భౌతికకాంక్షని వృద్ధిపరచుకోవడ మనీ అంటారు. స్త్రీ పురుష సంబంధంలో సౌఖ్యం అనుభ విస్తూయున్నారాలేదా! భౌతికకాంక్షని వొదలి సంసారాన్ని వదలి సన్యసించేవాళ్ళని సన్యసించవొద్దనడంలేదు. నిష్కామంగా కళ్లు మూసుకొని, హరిధ్యానం చేసుకొంటో, పుత్రులు కలగడానికి మాత్రమే అవస్థపడేవాళ్ళని పడవద్దనడంలేదు. కాని స్త్రీ సంభోగ వాంఛగల యే పదిమంది పాపాత్ములో యీ లోకంలో వున్నారుగా! ఈకలియుగంలో! వారికే యీపద్ధతులన్నీ. ఇన్ని వేదాంతాలు బోధిస్తున్నా స్త్రీని కావిలించుకున్నప్పుడు సౌఖ్యం కలగని అవస్థ యింకా మనుషులకు కొంతమందికైనా పట్టలేదు కదా! "మీరు సౌఖ్యపడాలనే చూస్తున్నారుకదా! పడేసౌఖ్యం కుళ్ళు సౌఖ్యం కాకుండా ఆరోగ్యవంతమూ, నిష్కల్మషమూ, అధిక ఆమోదకరమైన దాన్నే అనుభవించరాదా!" అంటాను.

మూడో యేటే పసిబిడ్డల్ని పుట్టించుకుని, భార్యని ఐదో యేటే ముసలిదానిగా చేసుకునీ, యేమిటి మీరుపడే సౌఖ్యం? తరువాత యితరుల భార్యల్నీ, వేశ్యల్నీ వెతకడమేగా! భార్యనే శుభ్రంగా, కొత్తగా ఉంచుకునే పద్ధతులాలోచిస్తే, ధర్మాత్ములు కోర్టు, వ్యభిచారం తగ్గుతుందిగా!

వివాహం ఆనందానికి కాదుట! 'సంస్కారంట! ఆనందానికి కాకపోతే, లోకోపకారార్థమేనా మీరు పెళ్ళిచేసుకునేదీ,

పిల్లల్ని కనేదీ? కని వాళ్ళను వొదిలేసి, దంపతుల్ని సుఖపడమన టంలేదుగా! ఇట్లాంటి సుఖాలు ప్రజల్ని యీలోకపు సుఖాల్లో ముంచి పరలోకాన్ని మరిచేట్టు చేస్తాయట? పరలోకాన్ని తలుచుకుంటూనే సంసారం చేస్తారుగావును వీళ్ళు! మరి ఆ గదులూ, పరుపులూ, చీరెలూ, అత్తర్లూ యెందుకో! పరలోకానికే! గర్భాదానాలకి యీ తొందరపడడాలూ పెళ్ళాంవచ్చిన మూడోనాడు యీ పెళ్ళిళ్ళూ, యివన్నీ పరలోకానికే!

వివాహం ధర్మమనీ సంస్కారమనీ, పతి దైవమనీ ఎంత బోధించినా, ప్రేమగుణాలమీద ఎంత ఆధారపడాలని నివేదించుకున్నా, చివరికి దాంపత్యం ముఖ్యంగా సంభోగసుఖంమీద ఆధారపడుతుంది. రాత్రి పక్కమీద తృప్తిపడ్డ భార్యాభర్తలు పగలంతా చాలా అన్యోన్యంగా వుంటారు. ఆ సుఖం తక్కువ కాగానే, కీర్తి, నగలూ, వంటలూ, అంట్లూ వీటిమీద ప్రేమ ఎక్కువవుతుంది; నూతనంగా స్త్రీలని పట్టుకునే జెయ్యాలూ, హిస్టిరియాలూ, బలహీనత్వాలూ, పురుషుడివల్ల వాంఛ తీరక పోవడంవల్లనే కలుగు తున్నాయి. లేచిపోవడాలూ అంతే. స్త్రీశరీరాన్నే గాక imagination కూడా తృప్తిచెయ్యాలి పురుషులు కొంతకాలంవరకు రోమాన్సునికూడా. ఈ గతి పురుషుడికి శరీరంలో శక్తి తగ్గడంవల్లా, స్త్రీని study చెయ్యకపోవడంవల్లా, నేర్పరితనం తెలుసుకోకపోవడంవల్లా కలుగుతోంది.

సహజమైన యీ వాంఛకి యీ తెలివీ నేర్పరితనం, నేర్చుకోడం ఎందుకని అడిగితే—

మృగాలకీ పూర్వపురుషులకీ శరీరవ్యాయామం, వంట చేసుకోడం, చదువుకోడం బోధించాలా! పరిస్థితులు మారడం

వల్ల యిట్లాంటి నేర్పరితనాలు అవసరమైనాయి. అన్నిట్లోనూ విద్యా, జ్ఞానమూ, తర్ఫీదూ, వొప్పుకుంటారు— ఈ వొక్క విషయంలోతప్ప. నోటితో వొప్పుకునే యీ విద్యావంతులు సహాయం వొచ్చేప్పటికి పరమమూఢులకన్న అన్యాయంగా ప్రవర్తిస్తారు.

స్త్రీ పురుష సంబంధం పిల్లలకోసమేగాని, సుఖమివ్వడానికి అనే సంగతి ప్రజలు మరిచిపోయినారు. అంతరాత్మలలో కూడా వొప్పుకోరు. మళ్ళీ పిల్లలు అక్కర్లేదు, అక్కర్లేదన్నా కలుగుతున్నారు, ఏం చెయ్యం? అని ఏడుస్తోనే వుంటారు. ఎవరో భార్యా భర్తల్ని బలవంతంగా పడుకోపెడుతున్నట్టు. సుఖదాయకం కాకండా, బాధానివృత్తికింద సృష్టిమార్గం కావడంవల్ల వొచ్చిన ఖర్మమిది.

పురుషులకేగాని, కొందరు స్త్రీలకి సౌఖ్యం రాదుకదా బాధకూడా పోదు. పురుషుడికి ఆమె విషయమై శ్రద్ధలేదు. ఎదో తన సౌఖ్యానికి ఏర్పడ్డ మెషీను అనుకుంటాడు ఆమెని. విసుగువొచ్చినప్పుడల్లా 'ఈ ఆడవాళ్లు...' అని తిడుతో వుంటాడు. ఆ కార్యం పాపకార్యమనీ, అసహ్యమనీ అనుకోడం వల్ల చాలా కాంప్లెక్సెస్ ఏర్పడ్డాయి. భార్యని తృప్తిపరచడం చాతకాక, ఆమె తృప్తికై కళ్ళెత్తితే, వెతికితే, ఆమెగుణాల్నీ, ఆమె వంశాన్ని తిట్టి, బంధించి పిచ్చెక్కిస్తాడు పురుషుడు.

శరీరాల్ని తృప్తిపరిచే జ్ఞానమూ, నేర్పూ, బోధించేందుకు పాఠశాలలు వుండాలి, ప్రతి యూనివర్సిటీలోనూ లెక్చరర్లు వుండాలి, Sex chair అని ఒక శాఖవినియోగించాలి. ప్రతి

వ్వారిలోనూ యీ విషయమైన కొత్తవీ ప్రాచీనమైనవీ పుస్తకాలు గ్రంధాలయాలు వుండాలి.

పురుషుడు వీర్యశక్తికి, స్తంభన శక్తికి, తన ఆరోగ్యాన్ని అభివృద్ధి చేసుకోవాలి. మరీ అవసరమైనప్పుడు నమ్మకమైన మందులుకొన్ని తప్పితే, (అవీ నమ్మకస్తులైన మిత్రులుగాని, డాక్టర్లు కాని చెప్పినవి తప్ప) బజారులో అమ్మే ప్రతిమందు వాడితే, స్వల్పవుపయోగానికై (అసలు ఉపయోగంవుంటే) చాల నష్టపడవలసివుంటుంది తరవాత.

స్త్రీ వాంఛని, ఆమె స్వభావాన్ని, కామాన్ని, తృప్తిని పురుషుడు జాగ్రత్తగా స్టడీ చెయ్యాలి.

తమకు చాతనైనంతవరకుయీకామశక్తిని,యితర విధాల మార్చుకుని అనుభవించాలి. ముద్దులలో, నవ్వులలో, స్నేహంలో, కళలో, కలలలో. శరీరసంబంధం అత్యవసరమైనప్పుడే వాంఛనీయం. కాని ప్రస్తుతం కొంచెం మనసులో ఏమాత్రం కోర్కెకలిగినా, తేరగా ఒకరికొకరు వున్నారుకదా అని పక్కమీదచేరతారు. ఆ మనసులో వాంఛకూడా లేకండానే, అలవాటు ప్రకారం ఆగంటకి తక్కిన కాలకృత్యాలవలె ఇదీ నెరవేరుసారు.

-o-

## గర్భ నివృత్తి మార్గాలు.

గర్భాదానం చేసుకునే భార్యాభర్తలకి, ఆసంతోషంలో పిల్లలు పుట్టవొచ్చుననే సంగతి జ్ఞాపకం వుండదు. కాని అవస

రం లేనప్పుడు పిల్లలు కలగడంవల్ల చాలా నష్టాలున్నాయి. పిల్లలు పుట్టి నెత్తిమీదికి వొచ్చిందాకా ఆ నష్టాలు తెలీవు చిన్న దంపతులకి. తెలిసిన వాళ్ళు చెప్పరు. జబ్బులూ ముఖ్యా అగ్నిప్రమాదాలవలెనే సహజంగా అనుభవించే బాధలలో పిల్లలు వొకటనుకుంటారు.

1. ఎదగని చిన్నపిల్లలకు పిల్లలు పుడితే ఆరోగ్యనష్టం.

2. చిన్నతనంలో దంపతులు స్వేచ్ఛగా అనుభవించ కండా పిల్లలు అడ్డు.

3. పూర్తిగా యింకా సంపాదనలేకముందే, పిల్లలు పుడితే, బీదతనంవల్ల కష్టాలు.

4. తల్లికి త్వరలో అందంపోతుంది. పెనిమిటికి అసహ్యం కలుగుతుంది. నీతివేత్తలు అసహ్యం కలగకూడ దంటారు. కలగ కూడదేమోగాని, కలుగుతున్నమాట వాస్తవమని వేనకువేలు ఉదాహరణాలున్నాయి.

5. తల్లి చిన్నదీ, అనుభవంలేనిదీ, తెలివిలేనిదీ ఐతే బిడ్డ శరీరాన్ని పోషించడంగాని, సరైన శిక్షణలో పెట్టడంగాని చాత కాదు.

6 ఏటేటా శిశువుల్నికంటే తల్లి బలహీనురాలవుతుంది.

7 చాలమంది పిల్లలుంటే సంసారభారం యెక్కువ అవు తుంది. వారిపోషణకు ధనం కావాలి. చాకిరీకావాలి, శ్రద్ధ కావాలి. యివన్నీచాలక, బిడ్డలు చెడిపోవొచ్చు. యితర పనులకు తలిదండ్రులకు వ్యవధి లేకపోతుంది, ఈ పనులతో.

8 జబ్బువల్లనైతేనేమి, సృష్టిలోపంవల్లనైతేనేమి, కొందరు స్త్రీలు, గర్భంకలిగికూడ కనలేనివాళ్లుంటారు.

9 సుఖరోగులూ, కుష్ఠులూ, పిచ్చివారూ, బలహీనులూ, తాగుమోతులూ పిల్లల్ని కనడానికి యోగ్యతలేదు. ఆరోగాలు పిల్లలకి రావొచ్చు.

10 కొందరికి పిల్లలుకావాలనే వుండదు. పిల్లలమీద యిష్టమే వుండదు.

11 వితంతువులకూ, పెళ్ళికానివారికీ, పిల్లలు పుట్టినట్లయితే సంఘంలో చిక్కులు. ఆపిల్లలకుకూడా అజన్మాంతమూ, హీనత్వము.

12 తరవాత కడుపులు పోగొట్టుకోడంకంటె, శిశువుల్ని చంపుకోడంకంటె యిది చాలా నయం.

ఇట్లా అసహజంగా పిల్లలు పుట్టకండా ఆపడం తప్పంటారు. మరి అక్కర్లేని పిల్లల్ని కని, తల్లీ తండ్రీ, తమ సుఖాన్నీ, వృద్ధినీ, పోగొట్టుకుని, బిడ్డకి తగిన శ్రద్ధా, ధనమూ యివ్వలేక, ఆబిడ్డ పురోభివృద్ధిని పాడుచెయ్యడం మంచిదేనా? స్త్రీ బానిసత్వమూ, బీదతనమూ, ఒకే స్త్రీకి పదినెల్లకొకరు చొప్పున పిల్లలు పుట్టడమూ, రోగాలూ, యివన్నీ సహజమేనా? అసహజమని మందులు పుచ్చుకోడం మానారా? తెల్లారి లేచింది మొదలు ఎన్ని అసహజమైన పనులు చేస్తున్నారు? ఇది వొక్కటే అసహజమయిందా? ఈశ్వరుడుఇచ్చే పిల్లల్ని అట్లా ఆపకూడదుట! ఈశ్వరుడు కంటున్నాడా మనుషులా! ఈశ్వరుడు ఇచ్చిన కురుపులకి మందులు వేస్తారేం? ఈశ్వరుడిచ్చే జుట్టుని కత్తిరిస్తారేం? ఈశ్వరుడిచ్చే భూకంపాల్ని తప్పించుకో చూస్తారేం?

కొందరు పురుషరేతస్సుని వృథా చెయ్యకూడదంటారు. రేతస్సులో ఒక్క అణువు గర్భం కలగజేసేది. తక్కిందంతా వృథాపోతోంది కద! సృష్టి భయపట్టంలేదు రేతస్సుని వృథా చెయ్యడానికి! మనుషులూ భయపడరు. కాని యీ నీతివేత్తలు మాత్రం పైకి యీ వెకిలి అభ్యంతరాలు వాదించుకుంటో తిరుగుతారు. అన్నివిధాలా కుళ్లు బతుకు బతికి అసలు రేతస్సు లేకండా యెండిపోయేవారూ కుళ్ళిపోయేవారూ యీనీతి సిద్ధాంతులే! పోనీ వృథా కాకండా ఆ రేతస్సునంతా దాచుకుని వుప యోగపరుచుకోరేం? ఎందరు బిడ్డలు వీలైతే అందర్నీ పందుల వలె కనాలని యెక్కడన్నా వ్రాసివున్నదా?

ఈ నివృత్తి మార్గాలను అసహ్యించుకోడం 'ఫాషన్' అయింది. వాటికి అభ్యంతరం కనబరచగానే 'అబ్బో' ఎంత నీతివంతుడో!' అనుకుంటారుకదా అని ఆశ. అదిగాక వీటిని అనుష్టించే వోపికా, ధైర్యమూ, శక్తీలేనివారూ, భార్యలచేత వొప్పించలేనివారూ, ఆసంగతిబైటపెట్టక, పైకి, 'ఓ మాకంతా తెలుసు వీటిసంగతి!' అవేం లాభంలేదు. అబద్ధాలు. వాటివల్ల జబ్బులు కలుగుతాయని ఆడాక్టరన్నాడు, ఈ ఘనుడన్నాడని వెక్కిరించి నవ్వుతో వుంటారు. నిశ్చయంగా వాళ్ళు ఈ పద్ధతుల్ని అనుకరించివుండరు. అనుకరిస్తే సరిగా అనుకరించివుండరు.

## నివృత్తి మార్గాలు.

రేతస్సు స్త్రీ అండంతో కలీకండాచేసేమార్గం యేదన్నా పనికివొస్తుంది. కొందరు మహాత్ములు అసలు యీ సంబంధం మానుకుని, యింద్రియనిగ్రహం చెయ్యడమే ఉత్తమమంటారు.

జబ్బుచెయ్యకండా వుండడానికి తిండి మానమన్నట్టుంది. మానడం అందరూ రుష్యులైనప్పుడు. యీలోగా యీదిక్కుమాలిన ప్రపంచాని కేదన్నా విధానం కనిపెట్టాలికద! దీనికి అనేక విధాలున్నాయి. వాటినిగురించి యింగ్లీషులో అనేక మార్గాలు చర్చింపబడివున్నాయి. మన దేశంలోకూడా రెండు మూడు పుస్తకాలు వున్నాయి. కొన్ని మంచిమార్గాలు వ్రాస్తాను.

## స్త్రీలు వుపయోగించేవి

ఈ పనికి ఉపయోగపడే చెక్ పెసరీలు ప్రతి మందుల షాపుల్లోనూ దొరుకుతున్నాయి ఇప్పుడు. దొరకకపోతే మద్రాసులో ఏ మందుల షాపుకి వ్రాసినా పంపుతారు. అదీ చాతకాకపోతే నాకు వ్రాయండి.

సాధారణంగా రెండు రకాల 'పెసరీలు' ఇప్పుడు అమలులో వున్నాయి.

**Diaphragm Vaginal Rubber Pessary.**

ఇవి మూడు సైజుల్లో దొరుకుతాయి.

చిన్నపిల్లకి చిన్నదీ, కాన్పులైన ఆమెకి మరీపెద్దదీ. సరైన సైజు తీసుకోడం ముఖ్యం. ఈ విషయమై తెలిసిన డాక్టరు దగ్గర సలహా మంచిది. కాని నూటికి తొంభైమంది డాక్టర్లకి తెలీదు. తెలీనివాళ్ళు తెలీనట్టు మాట్లాడక, తమకి తెలుసుననీ, ఇవేమీ ఉపయోగంలేవనీ, పైగా ఆరోగ్యానికి హానికరమనీ, అవినీతి మార్గాలనీ బోధిస్తారు. చాతనైతే, ఆ డాక్టరు తెలీని ఆ అబద్ధాలు మాట్లాడకండా మీరు ఏదన్నా శాశ్వతమైన శాస్త్రి చేస్తే లోకానికి మహోపకారం చేసినవారౌతారు.

సానుభూతి చూపే డాక్టరు దొరక్కపోతే, సందేహాలు వుంటే, ఉపయోగించడం చాతకాకపోతే నాకు వ్రాయండి.

ఈ పెసరీలను కడిగి పొడిగా శుభ్రంగా వుంచుకోవాలి. చేతుల్ని ముందుగా సబ్బుతో కడుక్కోవాలి. గోళ్లు గుచ్చుకోకండా కత్తిరించుకోవాలి. చూపుడు వేలుని స్త్రీ అవయవంలోకి చాచినట్టయితే, ఆ మార్గానికి ఎదురుగా ఒక ఉండవంటిది తగులుతుంది. అదే గర్భాశయంలోకి మార్గం. దీనిపేరు సెర్విక్సు. ఆ మార్గం కప్పి రేతస్సుని దానికి తగలకండా చెయ్యడమే ఉద్దేశ్యం.

ఉపయోగించే ముందు పెసరీకి contraceptaline అనే మందుకొని పూస్తే మంచిది. ఆ మందు లేకపోతే

1. కైనామిక్ళ్చరుగాని
2. నిమ్మకాయి రసంగాని
3. పుల్లమజ్జిగగాని
4. నీళ్లు కలిపిన వినిగర్ గాని
5. వాసలైన్‌గాని

పూసి, ఆ మార్గానికి ఎంత లోపల వీలైతే అంత లోపల సెర్విక్సుకి అడ్డంగా ఈ పెసరీని అమర్చాలి.

ఆ పెసరీ లోపలికి ఎక్కడికో పొట్టలోకో గుండెలోకో పోతుందని కొందరికి భయం. ఏమీపోదు. పోవడానికి మార్గం లేదు.

పొద్దున్నే వేలుపెట్టి సులభంగా తీసెయ్యవొచ్చు. తీసెయ్యకముందు వేడినీళ్ళతో డూష్, తీసింతరవాత సబ్బు నీళ్ళతో డూషూ చేసుకుంటే మంచిది.

దూషు చెయ్యడానికి వీలుకానప్పుడూ, దూషు పరిక రాలు కొనుక్కోలేనప్పుడూ యీ కింది రెండు పనులలో ఏదో వొకటి చెయ్యడం మంచిది.

Contraceptalineఅనే మందుని ఒక అరచెంచా లోపల పెట్టేసుకోవాలి.

లేకపోతే కొంచెం శుభ్రమైన దూదిని నిమ్మకాయల రసంలోతడిపి దాంతో పెసరీ తియ్యకముందూ, తీసింతరవాతా, ఆమార్గాన్ని శుభ్రింగా తుడవాలి.

ఈ Diaphragm pessary ఖరీదు రెండు రూపాయలు. contraceptaline ఖరీదు 2 రూపాయలు.

2. రెండోవిధమైన 'చెక్ పెసరీ'

Rubber cerical cap

ఈ పెసరీ, సెర్వికస్ని కప్పుతుంది.

ఇదికూడా మూడు సైజుల్లో వుంటుంది. సరైన సైజు డాక్టరు సహాయంతో ఏరుకోవాలి.

ఇదికూడా పై Diaphragm పెసరీవలెనే ఉపయోగించవొచ్చు.

3. ఈ మూడో మార్గం చాలా చవక. సామగ్రి తక్కువ. ఈ కింది వొస్తువుల్ని స్త్రీ అవయవద్వారంలోంచి సెర్వికస్ దగ్గిరికి వీలైనంత లోపలికి తోయ్యాలి. బాగా లోపలికి తోసెయ్యాలి. అవి చాలా శుభ్రమైన వొస్తువులు ఐవుండాలి.

1. డాక్టరు వుపయోగించే దూది

అదికాకపోతే ఇంక ఏశుభ్రమైన దూది ఐనా సరే.

2. చేతిరుమాలు.

3. పల్చని కాయితాలు ఉండచేసి.

4. స్పాంజి (గబ్బరుద్దె నాపరే). ఇది మందుల షాపుల్లో దొరుకుతుంది. పెద్దముక్క ఐతేచిన్న ముక్కలుగా కోసుకోవాలి.

ఈ పై పదార్థాలని యీ క్రింది ద్రవాలలో తడిపి ఉపయోగిస్తే మరీ మంచిది.

1. లాక్టిక్ ఆసిడ్ (Lactic acid) నూటికి ఒకవంతు చొప్పున నీళ్ళలోచేర్చి.

2. పులిమజ్జిగ.

3. Contraceptaline పుయ్యావొచ్చు.

4. Olive oil ఆలివ్ నూనె.

5. నిమ్మకాయల రసం.

6. నీళ్ళుచేర్చిన 'వినిగర్'.

7. వేసలైన్.

ఈ పదార్థాలని ప్రతిసారీ పారేసి కొత్తవాటిని ఉపయోగించాలి. వీటిని తెల్లారేదాకా బైటికి తియ్యకూడదు. తీసే ముందు డూషుచేసుకుంటే మంచిది.

4. ఒకవేళ యీ పద్ధతులు ఏవీ ఉపయోగించకండానే, సంగమం జరిగిందనుకోండి. అప్పటికైనా, ఆ ఆడావిడి ఐపోయిన వెంటనేనన్నా బుద్ధితెచ్చుకుని, యీ కిందిపనులు చేస్తే చాలావరకు ఉపయోగం వుండవొచ్చు.

1. పల్చని కాయితమో, దూదో, శుభ్రమైన పీలికో, నిమ్మరసంలోనో పుల్లని మజ్జిగలోనో ముంచి కుడిచేతి బొటన వేలిపక్కన ఉండే రెండు వేళ్ళకీ చుట్టి, ఆమార్గాన్ని శుభ్రంగా తుడిచి, వూడ్చివెయ్యాలి.

చివరికి సబ్బునీళ్లతోనూ, వుత్తవేళ్లతోనైనా శుభ్రం చెయ్యాలి.

## మొగవాళ్లు ఉపయోగించేవి

ఆడవాళ్లు నివారణపద్ధతులు ఉపయోగించని పక్షంలో మొగవాళ్ళు కాన్డం లేక ఫ్రెంచిలెటర్ ఉపయోగించవచ్చును. ఇది రబ్బరుగొట్టం. ఖరీదు ఒకటికి పావలానించి ఉన్నాయి. సులభంగా చిల్లులుపడతాయి. మధ్యలో చిరుగుతాయి. కనక ఒక్కసారికన్నా వుపయోగించడం మంచిదికాదు. ఒకసారే ఒకదానిపైన ఒకటి రెండు ఉపయోగించవొచ్చును. కొన్ని కడిగి దాచుకోడానికి వీలుగావుండేవికూడా ఉన్నాయి.

ఈ పైన చెప్పినవిగాక చాలా పద్ధతులు నమ్మకంగా చెప్తారుకాని సందేహించవలిసిందే.

## వీటిల్లో మొదటిది నిగ్రహం

ఇది చాలా పుణ్యకార్యమనీ, యోగమనీ, సాధ్యమనీ దొంగమాటలతో పూజిస్తారు. దీన్ని నమ్ముకున్న దౌర్భాగ్యులు చాలాకాలం అతి ప్రయత్నంతో బిగపట్టుకుని ఇతరత్రా మనసులు తీర్చుకునేవాళ్ళు, అసహజ కార్యాలతో తృప్తిపడేవాళ్ళు, రకరకాలవాళ్ళు బైలుదేరారు. ఆర్నెల్లు బిగపట్టి ఏ మంచి ముహూర్తానో, వాళ్ళు తెలీక జారి, ఇంక చూడండి, ఒకరిమీద ఒకరికి ద్వేషం, తమమీదే ద్వేషం, ఆ కార్యంమీదే ద్వేషం. తిట్లు, ప్రార్థనలు, నిందలు, రేండోవారు తమని గోతులో దింపారని, ఆ పుట్టబొయ్యే పిల్లని ఇప్పటినించీ రాక్షసిగా

తెలుసుకోడం. అనేక ఉద్దేశ్యాలతో నిగ్రహం అవసరమే. కాని, పిల్లలుపుట్టకండా నిగ్రహం చెయ్యమనడం రాక్షసం. ఆభయంతో స్త్రీపురుషుల్ని విడిపరచచూడడం దౌర్జన్యం. పిల్లలమీద తలితండ్రులకి, స్త్రీపురుషులకి పరస్పర సహజ వైమన్యకారణం. గర్భనివారణోపాయాలు అసహజమంటారు గాని, ఈ నిగ్రహమంత అసహజం, ఘోరం, దుర్నీతి ఇంకోటి వుంటుందా? ఈ సూత్రాన్ని అనుష్ఠించేవారికన్న యువకులకి బోధించే ఖద్దరు వృద్ధులు, చాలామంది వున్నారు; రైళ్లల్లో, ఇండ్లల్లో మీటింగులలో, జాగ్రత్త! రోగాలభయంతో నీతినీ, పిల్లల భయంతో, అభివృద్ధినీ అరికట్టాలనిచూసే మహానుభావులు వీళ్లు! చిన్నప్పుడే సంసారాలతో కుంగతీసి కట్టెయ్యకపోతే, యీ యువ్వనులు, బాలురూ, బాలికలూ, ఎదిగి, స్వేచ్ఛని పొంది, తమ హక్కుల్ని, తమ ఆస్తుల్ని, తమ మర్యాదల్ని, మానాల్ని, మాన్యాల్ని, కుళ్ళు దొంగదేశాభిమానాన్ని, దొంగదేవుళ్ళని, ఎక్కడ కూలతోస్తారోఅని భయం, యీ నీతి ధర్మ బోధకులకి.

డాక్టర్లకన్నా, మందులకన్నా, ప్రజల్ని మోసగించే జనద్రోహులు, క్షుద్రులు, అబద్ధీకులు ఉన్నారు- పత్రికారచయితలు. వాళ్లపేర్లు బైటపెట్టకండా విసురుతో వుంటారు సలహాలు, అభిప్రాయాలూ. అచ్చునిచూసీ ధర్మబోధనిచూసీ మోసపోకండి. వాళ్లు ఏ Madras లోనో కూచుంటారుగనక దేవతలు అనుకునేరు. ఎందుకూ పనికిరాక, డబ్బున్న పత్రికా యజమానుల అరికాళ్లునాకి, పదిహేనురూపాయలకై ఆత్మల నమ్ముకున్న శుష్క అప్రయోజకులు. కాసున్నర ఆలోచనా

శక్తిగాని, సాహసాగ్నిగాని లేని చవటలు. ఈ వ్యాఖ్యలూ విమర్శలూ అనే పెద్ద పేర్లుపెట్టి వ్రాసి ప్రజల్ని వేధిస్తారు.

వీళ్ళకిఉన్న సంస్కారానికీ, మెదడుకీ తోడు వీళ్లు విమర్శించడానికి సిద్ధం! పెద్దపట్టణాల్లో సైడుకాలవలపక్కన పదేసి మందిపిల్లల్ని పెట్టి, కుళ్లుతో యీ నవీనపద్ధతుల్ని వెక్కిరిస్తారు. అవినీతి అంటారు. పైకి ధర్మాలనిభోధించినా, గుండెలు విప్పి చూస్తే లోపలంతా 'జెలసీ', యీర్ష్య, ఓర్వలేనితనం, ఏడుపు, మురికి, యువకులమీదా, ప్రపంచాన్ని బంధాలనించి, బాధల్నించి దారిద్రాన్నించి తప్పించాలని చూసే ప్రతి ప్రయత్నంమీదా కోపం. తమవికాని కాయితాల్ని చెరిచే యీ పేరులేని పురుగులకి, ఏ ఆశయమూ, ఈ విశాలత్వమూ, hope, గతీ, యింక లేక బాగుపడేవాళ్ళని చూడలేక, ఆ చీకట్లోంచి ఎట్లాననా చదివే ప్రజల్ని మోసగించి తమమల్లే ఎందు వితంతువుల్నిగా మార్చాలని చూస్తారు; నమ్మకండి.

రెండోది—రజోపతనం కాకముందే ఆపడం. ఇదీ చాలా కూరమైన కార్యం. సంభోగంలో ఉద్రేకింపబడే రసాలవల్ల పరస్పర ఆరోగ్యం హెచ్చుతుందని నవీన సిద్ధాంతం. అందువల్లనే "కాన్డం" ఆరోగ్యానికి మంచిదికాదు.

బహిష్టు అయిన రోజుల్లోనూ, నెలలో మధ్యరోజుల్లోనూ గర్భం కలగదంటారు-అదీ నమ్మతగిందికాదు.

పిల్లపాలు కుడుచుకుంటున్నాళ్లూ, గర్భంరాదన్న సంగతి కొంతవరకే నిజం. పిల్లలు చచ్చిపోయినప్పుడూ, పాలువొదిలినప్పుడూ, పిల్లల బదులు తామే ఆ పనిని చేసే పురుషులున్నారు-ఇట్లాంటి నమ్మకాలవల్ల.

పెద్దవాళ్ళమని, నీతులు బోధించే ప్రతివాడు దొంగ. దేవుడూ, మతమూ, పుణ్యమూ, ధర్మమూ, అనుభవమూ, ఇవన్నీ మాట్లాడేవాడు వంచకుడు. నవీన యువకులు నవీన పద్ధతుల్ని నమ్మి ఆచరించాలి. ఎంతో సాహసం కలవారూ, యోచించేవారూ, తిరగబడేవారూ క్రమేపీ దేశంలో ఎక్కువవుతున్నారు. కాని యీ చదువు చెప్పే బదులకూ, విద్యకీ, పెళ్లిళ్లకీ, పిల్లలు కలగడానికీ తిరగబడేవాళ్లు చాలా అరుదు. భార్యనూ పిల్లలను త్యజించగలిగిన కాఠిన్యంలేకా, కామశక్తిని పరిపాలించుకోలేకా, ఆశయాలకూ, సాహసాలకూ, దూరస్థులై, చాలా త్వరలో సంసారాలూ, ఉద్యోగాలూ, మింగివేస్తే, మిటకరిస్తో, ఏమీచెయ్యలేక, తమ పూర్వ ఉత్సాహాలకి తామే విరోధులవుతున్నారు. ఎవరో ఒకరు తప్ప ముప్ఫైయేళ్ళ తరవాత ఇంకా బతికివున్న మనుషుల్ని యీ దేశంలో కనుక్కోడం చాలా కష్టం. తలితండ్రులకూ, పుట్టే పిల్లలకూ తగిన పరిస్థితులు ఏర్పడ్డదాకా పిల్లల్ని కనకూడదు అని నిశ్చయించుకోవాలి. ఇప్పటివల్లే పందులవల్లే సృష్టికిలోబడి, యీని litters పెట్టడం మానెయ్యాలి. పెళ్లాల్నీ సంసారాల్నీ మీకు బుద్ధితెలీక పూర్వమే కట్టి మిమ్మల్ని కుంగతియ్యాలని చూస్తున్నారు పెద్దలు.

కామానికీ, సృష్టి అధికారానికీ లోబడి పిల్లల్ని కనడం తప్పించుకోలేని ఘోరనరకంనించి తప్పించారు ప్రజల్ని యీ మార్గాలు. ఈ మహావరాన్ని వినియోగపరుచుకోక భ్రష్టులు కావొద్దు. పద్ధతులు కూడా సులభమవుతున్నాయి. దూది, బట్టముక్క చాలు. శుభ్రమైనవి దొరక్కపోతే మురికి

దైనాసరే, మురికివల్ల ఏదన్నా జబ్బుచేస్తే తరవాత కుదుర్చుకోవొచ్చు. పిల్లలు పుట్టడంకన్న నయం ఆ జబ్బు.

చివరికి యీ సులభమైన పద్ధతికూడా చాలా ఉపయోగిస్తుంది.

నూలు వొడకగా మిగిలిన ఏకుల దూదిని విడిపోకండా దారంతో చుట్టి (అరిచేతి వెడల్పున, అరిచేతిమందాన వుండాలి) నీళ్ళతో తడిపి స్త్రీ సృష్టి అవయవం బాగా లోపలికి తోసేసినా, గర్భాన్ని నివారణచేస్తుంది. దాన్ని తెల్లవారి తీసేసి అవతల పారెయ్యాలి.

ఈ పద్ధతులుగాక, మొగవాళ్ళకీ ఆడవాళ్ళకీ ఆపరేషన్లు కూడా వున్నాయి; సులభమైనవీ, కష్టమైనవీ. వాటి విషయమై తెలుసుకోకోరేవాళ్లు నాకు వ్రాయండి.

---

## సుఖరోగాలు

—:o:—

ఇటువంటి జబ్బులున్నాయని తెలుసుకుని, తెలీనివారికి చెప్పి అవి కలిగే విధాల్ని, వాటి చిన్హాల్ని పరీక్షించి, వాటినించి కాపాడుకునే మార్గాల్ని బోధిస్తేనేగాని యివి నశించవు. కాంతీ, జ్ఞానమూ, మంచి గాలీ, శుభ్రమైన ఆలోచనలూ వున్నచోట, వ్యాధికీటకాలు వృద్ధిపొందవు. ఒకవేళ తగిలినా వ్యాపించవు. సిగ్గుపడి, మొహమాటపడి, నీతి అనే పేరుతో, బట్ట కప్పి దాచిన చోట వ్యాధి మరింత కుళ్ళుతుంది. యవ్వనం రాగానే యీ

విషయాలు అందరికీ చెప్పాలి, ఆడవాళ్ళకీ, మొగవాళ్ళకీ. వ్యభిచారం చేసేవాళ్ళకీ తటస్థించే న్యాయమైన శిక్షలే యీ రోగాలని తలచి వుపేక్షచెయ్యకూడదు.

ఈ రోగాలూ, అన్ని జబ్బులటువంటివే. దురదృష్టంవల్లా తెలివితక్కువవల్లా, ప్రజల శక్తికి మించి తటస్థిస్తాయి. ఎక్కువగా తిని అజీర్ణంవల్ల బాధపడుతున్న దానికి మందియ్యడం మాన్తారా! ఆకలివలె కామమూ ఒక సహజమైన కోర్కె. ఈ రోగాలు దానికి తగిన శాస్తి అనుకోడం రాక్షసం. అన్ని అంటుజాడ్యాలవంటివే యివీనీ! స్ఫోటకమూ, క్షయా, పాపాలు చేస్తే కలుగుతున్నాయా? ఏపాపానికో అవి శిక్షలే ఐతే, అనుభవించనీక, నయంచేస్తారేం? ఈ సుఖరోగాలమీాదమాత్రం అంతకోపమెందుకు?

విచ్చలవిడిగా అనేకమందితో కలియడంవల్ల యీ రోగాలు వొస్తాయనుకోడం అజ్ఞానం. రోగాలు లేనివాళ్ళనించి యీ రోగాలు రావు. వున్నవాళ్ళల్లో ఏ ఒకరి దగ్గిర్నించో రావొచ్చు. ఈ రోగాల విషయమై అనుభవం పొంది, గుర్తించి తప్పించుకునే వివేకవంతుడు యెంత వ్యభిచారంచేసినా రోగం రాదు. ఇవి వుంటాయని తెలియని మూఢుడికి ఒక్క అనుభవంతో ఇవి తటస్థిస్తాయి. పాతదొంగలకీ, వంట్లో యీ రోగాలు జయించిన వారికీ రానేరావు. ఎవరిని నీతివంతులుగా తయారు చెయ్యాలని, యిట్లాంటి తుచ్ఛమైన విషయాల సంగతులేమీా తెలీకండా దాచివుంచి, పురాణాల్లోని నీతులు మాత్రమే నేర్పి, మోసపుచ్చుతామో, వాళ్ళేగోతులో పడేది. చిన్నప్పటినించి విచ్చలవిడిగా పోకిరీవాళ్ళతో తిరిగి, యీ మాటలూ,

బూతులూ, వింటో, లోకజ్ఞానం సంపాదించుకున్న పోగరు బోతులు సుఖంగానే వుంటారు.

కనక నీతి దుర్నీతులకీ యీ రోగాలకి సంబంధంలేదు. లోకమంతా నీతిపరులైనా యీ రోగాలు మాయంకావు, అందరూ జ్ఞానవంతులైతేనేగాని. సాధారణంగా యీ రోగాలు నీతికి ప్రసిద్ధికెక్కిన మనుషుల్నే అంటిపెట్టుకుని వుంటాయి. అందరికీ తెలిసిన దుర్మార్గుడు భయపడక వెంటనే డాక్టరు దగ్గిరికివెళ్ళి నయంచేసుకుంటాడు. ఈ నీతిపరులు, ఎంత కాన్సట్టు నటించినా మనుషులే గనకనూ, మనుష్య అవయవాలు గల వారు గనకనూ, వాళ్ళ అబద్ధ హృదయాలలో కూడా రసికుడైన యీశ్వరుడు ప్రకాశించడం మానలేదు కనకనూ, సహజమైన, మనుష్యమైన కార్యాలు కొన్ని చేసి, రోగాలు ఎట్లానూ తెచ్చుకుంటారు. నీతిపరులు కావడంచాత డాక్టరు దగ్గిరికి పోరు. రహస్యంగా దాచుకుని, కుళ్లి, శాశ్వతంగా, యీరోగాలకి శరణ్యమిచ్చి, పైకిమాత్రం, నీతి వుపన్యాసాలిచ్చుకుంటో, యీ రోగాలు అందరికీవొచ్చి బాధపడాలనే ఆశతో, వాటిని కుదుర్చుకోకూడదని, వాంఛిస్తో తిరుగుతారు. సహజంగా వ్యభిచారంచేసి, సౌఖ్యం అనుభవించే రసికుల్ని చూసి, యీర్ష్యపడే పిరికిపందలూ, అనాథలూ, సమయం దొరకని పతివ్రతలూ ఎవరూదొరకని కురూపులూ, సంతోషిస్తో వుంటారు- యీ రోగాలు వున్నాయికదా, ధైర్యంగా పాపం చేసే మనుషుల్ని శొధపెట్టడానికని. అందుకనే యీనీతిపరులూ మతాచార్యులూ, సంఘసంస్కర్తలూ, యీ నివృత్తిమార్గాల జ్ఞానాన్ని వ్యాపించనీరు.

ఈ రోగాలు తెచ్చుకునేవారు చేసినట్టు, తక్కిన రోగాలు రానడానికి ఏదో పాపపుకార్యం చెయ్యరుకదా అంటారు. రోగానికి అజ్ఞానం కారణంగాని పాపంకాదు. ప్రాణం రక్షించడానికైనా నీళ్ళలో దూకితే జలుబుచెయ్యక మానదు. అట్లానే యీ పాపంచేసే ప్రతివాడికీ యీరోగం వొస్తోందా? తెలివి తక్కువగా చేసేవాడికి వొస్తోంది. అదిగాక వొక్కనిమిషం చేసిన సహజకార్యానికి, జన్మమంతా, ఘోరమైన బాధపడమనడం నరకంలోకూడా జరగదు. ఆమనిషేగాక, ఆకుటుంబం, సంతతీ, బాధపడతారుకద!

ఈ రోగాలు తెచ్చుకున్నందుకు, వాటి బాధని అనుభవించడం, న్యాయమనుకున్నా, బుద్ధిపూర్వకంగా తెచ్చుకున్నవాళ్ళకంటె, యేమెరక్క, యే తప్పూ చెయ్యక, అన్యాయంగా యీ అంటుడు జాడ్యాలతో బాధపడే వాళ్ళు యెక్కువమంది వున్నారు. మతంప్రకారం, నీతిప్రకారం, రోగిష్టివైన భర్తకి భార్య లోబడాలా లేదా! భర్త దగ్గిర్నించి జబ్బు లంటుకున్న భార్య బాధపడుతోందా? తల్లి తండ్రులకు యీ జబ్బులుండడంవల్ల, పుట్టడమే ఆ జబ్బులతో పుట్టిన పిల్ల లేమి పాపం చేశారు? వాళ్ళకన్నా కుదర్చాలా? ఈ పుణ్యాత్ముల బోధనలవల్ల జబ్బులు కుదుర్చుకోక, సిగ్గుపడి, మురగపెట్టుకుని, ఒకళ్ళనించి యింకోళ్ళు, వ్యాపకంచేసుకుని, నీతిపరులు, అవినీతిపరులు, బిడ్డలు, ముసలివారు అనేక తరాలు వీటితో పుచ్చిపోతే, నీతి-సంఘంలో యెక్కువవుతుందా? యీ పుణ్యాత్ములు జబ్బులున్న వాళ్లని అంత నీచంగా చూడకపోతే, ఆరోగులు సిగ్గుపడి



దాచుకోక నయంచేయించుకుని వాళ్లూసుఖపడతారు, సంఘమూ ఆరోగ్యవంత మౌతుంది.

కనక ముందు యీ జబ్బుల్ని తక్కిన వాటివలెనేచూచి ప్రజలకు సిగ్గూ భయమూ పోగొట్టాలి. రెండోది ఇట్లాంటి రోగాలున్నాయనీ వాటిని అంటించుకోవొద్దనీ చిన్నవాళ్ళందరికీ చాటించుకోవాలి. ఈ రోగాలు రాకండా జాగ్రత్తపడే పద్ధతు లున్నాయని అవేమిటో దేశమంతటా విరివిగా బోధించాలి. ఆ పద్ధతుల్ని నేర్పడమేకాకండా, ఉపయోగించేట్టు బతిమాలి, ప్రోత్సహించి, బలవంతం చెయ్యాలి. ఈ రోగాలు వున్నవాళ్లకి ధర్మంగా బాగుచేసే ఆస్పత్రులు దేశమంతా స్థాపించాలి. తక్కిన జబ్బులకంటె యివి అతి శ్రద్ధగా కుదర్చాలి. ఎందుకంటే ఒకరి నించి ఒకరికి, ఒకతరంనించి యింకోతరానికి వ్యాపించి మను షుల్ని పీల్చి పిప్పిచేస్తున్నాయి. జాగ్రత్త తీసుకుంటే, వీటి పేరు లేకండా రూపుమాపడానికి వీలుంది.

1. సుఖరోగాలు రాకండావుండాలంటే ఒకటే ఉపాయ మనీ, అది అసలు బ్రహ్మచారులుగా, ఋషులుగా వుండడమనీ,

2. ఈరోగాలభయంతో దుర్వృత్తి తక్కువగా వుండనీ అందువల్ల యీ రోగాలు వుండడం చాలా అవసరమనీ. కనక యీ రోగాలు యింకా భయంకర రూపంతో ప్రబలాలనీ,

3. వ్యభిచారాన్ని అణిచివుంచడానికి యీశ్వరుడు వీటిని సృజించి ప్రపంచాన్ని వుద్ధరించాడనీ,

చాలా మంది నీతివంతుల అభిప్రాయం.

సుఖరోగాలు వున్నాయని తెలిసి, వాటిని అంటించుకుని, నరకబాధపడి, కుదుర్చుకుని అమర్నాడే మళ్లీ వాటిని ప్రజలు

తెచ్చుకుంటారని డాక్టర్లందరికీ తెలుసు. కనక యీ రోగాల భయంవల్ల వ్యభిచారం తగ్గుతుందన్నమాట అబద్ధం. ఎంత భయపెట్టీ, యెంతబాధపెట్టీ, ఆ సహజవాంఛని ఆపలేరు, సత్పురుషులుగాని, రోగాలుగాని. ఇట్లాంటి భయాలు కల్పించా, ప్రజలలో నీతిని స్థాపించేది? రోగంలేకండా పరీక్షచేసుకుని స్త్రీని ఏరుకోవాలనా వీరి అభిప్రాయం? కన్యల్ని మాత్రమే పొందాలనా?

పూర్వకాలంలో, దొంగతనంచేస్తే, చేతులూ కాళ్లూ తెగకొట్టేవారు. ఆభయంచేతనైనా, దొంగతనాలు తక్కువైనాయా! ఇప్పటికంటె అప్పుడే యెక్కువ పైగా. దొంగతనానికి కారణం దారిద్ర్యం. అది తగ్గితే దొంగతనం తగ్గుతుంది. కరువు కాలంలో దొంగతనం యెక్కువని అందరికీ తెలుసు. శిక్షలవల్ల నేరం ఆగదు. ప్రతిసారీ కడుపునొప్పి రావడం నిశ్చయమైనా భోజనం మానగలరా?

స్త్రీ పురుషుల ఆకర్షణని అరికట్టడమంటే సముద్రానికి ఆనకట్టకట్టడమే. కనక స్త్రీ పురుషులు కలుస్తున్నా, వారు కొంచెం జాగ్రత్తపడి, కొన్ని మందులు వుపయోగించినట్లయితే యీరోగాల వ్యాపకం తగ్గుతుంది. ఈ ఘోరమైన విపత్తునించి తప్పించుకోవచ్చు. కాని పుణ్యాత్ములు జ్ఞానాన్ని వ్యాపకం చెందనీరు, కనక పాపాత్ములైనా శ్రద్ధవహించి యీ జ్ఞానాన్ని యితర పాపాత్ములకీ, ప్రతిస్త్రీకీ, పురుషుడికీ, ముఖ్యంగా నవ యవ్వనం సమీపించేవారికీ తెలియచెయ్యాలి.

నిర్మలాత్ముల భయమేమంటే, యీ రోగాల భయంలేకపోతే, ఇంక అదేపనిగా ప్రజలు దుర్మార్గం మొదలుపెడతారని.

ఈ పవిత్రవంతులకు సృష్టికార్యమంటే అసహ్యం. తాము చేస్తోనేవుంటారు, కాని పైకి దొంగవైరాగ్యమూ, పశ్చాత్తాపము నటిస్తారు. ఇతరులు తమ సంసారాన్ని పాడుచేస్తారని భయం. ధైర్యమేవుంటే, 'యీ యింటో రోగాలున్నాయి జాగ్రత' అని చెక్కకట్టి, విటుల్ని దూరానవుంచే ప్రయత్నం చేస్తురు. కాని లోకులు రోగాలకి భయపడరని తెలుసు. యీ పుణ్యాత్ములే భయపడేది; ఎందుకు ? పిరికివారుగనక. తమ కే గనక యీ నివారణాపద్ధతులు తెలిపే పుస్తకం సంగతి తెలిస్తే, పదిరూపాయలైనా వి. పి. తెప్పించుకుని రహస్యంగా గదిలో అర్ధరాత్రివేళ చదువుకుని యినపబీరువాలో పుస్తకం తాళం వేస్తారు. ఎవరైనా యీ పద్ధతులు తెలిసినవారున్నారంటే, వాళ్ళచుట్టూతిరిగి, ఆ జ్ఞానం యెవరో తమ స్నేహితులకి కావాలని యాచించి, రహస్యంగా కాళ్లు పట్టుకుంటారు. కాని ప్రజలకి, తక్కినవాళ్ళకి, బోధించకూడదంటారు. ఎందుకంటే ప్రజలు మూర్ఖులు దుర్మార్గులు, వాళ్లు యీ జ్ఞానాన్ని దురుపయోగపరుస్తారంటారు. దురుపయోగమంటే వీరి అర్ధమేమంటే జబ్బులు రాకండా చేసుకోడమూ, వారి సంసారాల జోలికి రావడమూ.

సంఘంలోవున్న కుళ్ళుని లేదని, పాతిపెడితే, అది అంతటితో అంతరిస్తుందనుకుంటారు, పుణ్యాత్ములు. కాని లేమపొమ్మని ఓటిస్తే మాత్రం రోగం దాగుతుందా ? అఖ్లేదంటే బాధ తప్పుతుందా ? ఇట్లాంటి రోగాలు సంఘారోగ్యాన్ని పీల్చిపిప్పిచేస్తున్నాయి, వీటి నెట్లా యెదిరిద్దామని అడిగితే, దుర్నీతి తగ్గితే, అసలే ఆ కార్యాలు మాని యింద్రియ నిగ్రహం కలిగి

వుంటే సరి, అని సమాధానం చెపుతారు. ఈ మాటలనేవారు ఆ నిగ్రహాన్ని కలిగివుండరు, వుండలేరు. తమ కార్యాలు మానరు, మానలేరు. కాని ఇతరులు మాత్రం తమ ఆదేశం ప్రకారం నడుచుకోవాలని వారి వుద్దేశ్యం.

స్త్రీ పురుష ఆకర్షణ నీతిగాని అవినీతిగాని, లోకంలో వుంది. లేదనీ, వుండకూడదనీ ఏదో తమ చిత్తమొచ్చిన విధం గానే వుండాలనీ ఎంత వాదించినా, ఎన్ని వేదాంతాలు చెప్పినా అది మాయంకాదు. కనక నెరి వేదాంతబోధలు మాని సహజమైన యీ శరీరాకర్షణవల్ల కలిగే యీ రోగాలనించి యెట్లా తప్పించడమా అని యోచించాలి ఇన్ని యుగాలు యీ నీతుల్ని బోధిస్తున్నారు. రోగాలు యెక్కువై సంఘ దౌర్బల్యం నానాటికీ ఎక్కువ కావడమేగాని, యింక యేమీ ఫలితం కనపడలేదు. ఎంత నీతి బోధించినా శరీరాలు, శరీరాలు గానే వున్నాయి.

ఈ రోగాలు వేశ్యల దగ్గరే వుంటాయని చాలామంది నమ్మకం. సంసార స్త్రీలతో పోలిస్తే వేశ్యలదగ్గర యీ జబ్బులు చాలా తక్కువ. ముందుగా మంచంవేపుచూపే స్త్రీ, తనంతట తనకీ పురుషుడిమీద మోహం వొచ్చిందని మీదపడే స్త్రీ వీళ్ళ విషయం ఏమాత్రం నమ్మకూడదు. వెర్రియువకులు, తన రూపంచూసి, నిలవలేక స్త్రీ వొచ్చిందని, దిగులుపడి తమ ప్రభావానికి గర్వపడి సులభంగా బోల్తాకొడతారు.

ఈ నివారణోపాయాలు మంచివేనా అని డాక్టర్లని అడిగి లాభంలేదు. రోగాలు, గర్భాలు రాకపోతే వాళ్ళ ఆదాయం సున్న. కనక నివారణోపాయాలు నిపయోగంలేదంటారు. అదీ

గాక వాళ్ళకి యీ సంగతులు కాలేజీలలో చెప్పరు, వాళ్ళు తెలుసుకోరు.

ఈ జబ్బురాగానే మాత్రం డాక్టరు దగ్గిరికివెళ్ళితీరాలి. కాటలాగుల్లో, పత్రికల్లో చూసి మందులు తెప్పించివాడడం చాలా అపాయకరమైన పద్ధతి.

## ముఖ్యమైన సుఖరోగాలు రెండు.

## 'సిఫిలిస్' లేక సవాయి.

ఇది ముఖ్యంగా సృష్టికార్యంవల్లనే ఒకరినించి యింకొకరికి వ్యాపిస్తుంది. ఈ రోగము అసలు ఒకరిదగ్గిర వుంటేనే గాని రెండోవారికి రాదు. దానంతట అది పుట్టదు. యేం చేసినాసరే, ఎంతమంది ఆరోగ్యవంతులతో కూడినా సరే!

అదిగాక తలితండ్రులకు వుంటే పుట్టేప్పుడే బిడ్డలకు వుంటుంది. బిడ్డలు గర్భంలోనే చచ్చి, వికారరూపులై పుట్టవొచ్చు.

ముద్దులవల్లా, కావిలింతలవల్లా, ఎంగిలివల్ల కూడా రావొచ్చు. పాలదాయినించి పిల్లకీ, పిల్లనించి పాలదాయికీ రావొచ్చు.

ఇది భయంకరమైన రోగం. మనిషిని వదలక జన్మమంతా యెదో వొక రూపాన యేడిపించి, తరతరాలా వంశాన్ని వొదలక పీడించి పీల్చి పిప్పిచేస్తుంది.

చాలా ముదిరితేనేగాని యే మనిషిదగ్గిర యీ రోగం వుందో తెలుసుకోడం దుర్ఘటం ముఖ్యంగా స్త్రీలలో.

ఈ రోగం నాలుగు స్థితులు కలది.

## మొదటి స్థితి

ఈ రోగం అంటగానే ప్రారంభం. రోగం తగిలిన నెల రోజులలో రహస్యావయవాలపైన ఒక చిన్నకురుపు లేస్తుంది. దానివల్ల బాధ వుండదు. తక్కిన సుఖరోగపు కురుపులకున్నూ దీనికిన్నీ అదే భేదం. తక్కినవి మొదటినించీ అమితమైన బాధ కలిగిస్తాయి. స్త్రీలలో యీ కురుపుని కనిపెట్టడం కష్టం.

తరవాత వెంటనే గజ్జలు వాసాయి.

## రెండో స్థితి

తరవాత ఆరువారాలలో, జ్వరమూ, వొళ్ళునొప్పులూ, తలనెప్పి, కీళ్ళలోనొప్పి, వొంటిమీద మచ్చలు కనపడతాయి.

అటుతరవాత మచ్చలెక్కువవుతాయి, గొంతు పుండు, నోటిపూత, బుగ్గలలోపల, పెదిమలమీద మచ్చలు, రహస్యావయాలమీద మచ్చలు, జుట్టురాలడం తటస్తిస్తాయి.

లోజ్వరం, పాలిపోవడం, రాత్రులు తలనొప్పి, కీళ్లనొప్పులు, కంటిరోగం.

## మూడో స్థితి

ఇది రెండో స్తితికి ఒకటిన్నర సంవత్సరం తరవాత కలుగుతుంది.

వొంటిమీద గుంటలు- మధ్యగుంటలలో చర్మం తినివెయ్యడం, కాళ్ళమీద రసి కారే కురుపులు. వెముకలు తినివెయ్యడం. రాత్రులు యెముకలలో బాధ. ముక్కు దగ్గిర వెముక తినివెయ్యడం, శరీరంలో యెక్కడన్నా కానీ గుంటలు

పడడం. కీళ్ళువాచి, నిరుపయోగం కావడం, కంటి జబ్బు ఇవన్నీ కాని, కొన్నిగాని తటస్తిస్తాయి.

**నాలుగో స్థితి**

ఆ

బుద్ధిమాంద్యం, పిచ్చి ఎక్కుతున్నట్టుండడం, కళ్ళజబ్బు. జ్ఞాపకశక్తి తగ్గడం, పక్షవాతం, చివరికి పిచ్చి, తరవాత చావు.

## చి కి త్స.

ఒకసారి రోగం తగిలిందా, ఇంకా కొన్ని సంవత్సరాల దాకా ఏ మందులుతిన్నా, ఆరోగం వొదిలిందని నిశ్చయంగా చెప్పడం కష్టం. కాని ఎంత త్వరలో చికిత్స ప్రారంభిస్తే అంత మంచిది. మూడునెలలన్నా చికిత్స చేయించుకుంటేనేగాని కుదరదు. కాని, ప్రారంభదశలో తప్పక కుదిరి తీరుతుంది.

సిఫిలిస్‌ని పోలినదే ఇంకో జబ్బు వుంది. దానికే ఆచోటనే పొక్కులు లేస్తాయి కాని ఇవి చాలా బాధ. కొద్ది రోజుల్లో 'కార్బాలిక్ ఆసిడ్' వేస్తే నయమవుతాయి. వాటి వల్ల వుపద్రవంలేదు. ఇవి సిఫిలిస్ అనుకుని గాబరాపడేవారూ, సిఫిలిస్ కురుపు ఈ పొక్కులే అనీ పోయిందికదా అనీ మోసపొయ్యేవారూ వున్నారు.

## గనేరియా లేక పచ్చశగ.

ఇది చాలా విస్తారంగా వ్యాపించియుంది. దీనివల్ల నపుంసకత్వమూ, గొడ్రాలితనమూ, కలుగుతాయి. ఇది గల తల్లికి గుడ్డిపిల్లలు పుట్టవొచ్చు.

ఇది పురుషుల్ని చాలా బాధ పెడుతుంది. అందుకని కుదుర్చుకుంటారు. స్త్రీలనంత బాధ పెట్టదు. కనక నిర్లక్ష్యం చేస్తారు. అసలు యీ వ్యాధి వున్నదనే స్త్రీలకి తెలీదు. కనక మూర్ఖంగా దీన్ని యితరులకి ప్రసాదిస్తో వుంటారు.

భోగంవారికన్నా సంసారులే యీరోగాన్ని యెక్కువగా వ్యాపింపచేస్తున్నారు.

## మొగవాళ్ళ విషయం.

జబ్బు తగిలిన రెండు మూడు రోజుల లోపునే, ఆ అవయవందగ్గిర దురదా, వాపూ, బయలుదేరుతుంది. దాని మూతి యెర్రనై చీముచుక్క కనపడుతుంది.

తరవాత యింకా యెర్రగావి, పసుపుపచ్చ పదార్థం బయలువెడలుతుంది. అల్పాచమానం చేసేప్పుడు బాధ. అల్పాచమానం మురికి. ఇదివరకటికన్న తక్కువ ధార. అసలు మూత్రం పొట్టలోపలే వుండిపోవడం, యివన్నీ తటస్థిస్తాయి.

తరవాత ఆ అవయవం వంకరగా పోతుంది. కొంచెం లోజ్వరం, బలహీనం.

ఈ చిహ్నాలు పది పదిహేనురోజుల్లో సద్దుకుంటాయి. తరవాత రోగం వంటబట్టించి అనేక రోగాలకు కారణమౌతుంది.

## స్త్రీల విషయం.

చాలాత్వరలో ఒక్కరోజులోనే చిహ్నాలు కనపడతాయి కాని బాధ తక్కువ. అసలు చిహ్నాలు గుర్తించకనేపోవొచ్చును.

ఆ అవయవం వాయడం, యెరుపుబాధ, అల్పాచమానం బాధ, తరవాత పచ్చని చీము వొస్తుంది.

అటుతరువాత వంటబట్టిసుంది.

## చికిత్స

ఈ రోగం తగిలిన రెండుదినాలలో అది అభివృద్ధిచెందకండా చికిత్స చెయ్యవొచ్చు. తరవాత డాక్టరు మెల్లిగా కుదర్చవలసిందే.

ఈ రెండు రోగాలుగాక యింకా చిన్న సుఖరోగాలు అనేకం వున్నాయి. కాని అవి అంత బాధ పెట్టవు. అవి ముఖ్యంగా కురుపులు, పొక్కులు రూపాన కలుగుతాయి. ఎదన్నా 'పొటాసియం పర్మాంగనేట్' లేక 'కార్బాలికాలసిడ్' మలాం వేసినట్లయితే నయమవుతాయి. శుభ్రంగా వుంచితేసరి.

కాని యీ రెండు రోగాలూ తగిలితేమాత్రం, సిగ్గుపడక, వెంటనే వైద్యుడిదగ్గిరికి వెళ్ళి, నయమయిందాకా పట్టుబట్టి వైద్యం చేయించుకోవాలి. ప్రజల్ని మోసపుచ్చి డబ్బు లాగడానికని ప్రచురించే మందులు వాడకూడదు. జబ్బు కుదిరేలోపల యీ రోగాల్ని యితరులకి అంటించడం మహా పాపం, ప్రభుత్వంవారు శిక్షించవలసిన విషయం. చిన్నాలు మాయమైనా జబ్బు నిర్మూలంకాదు. కనక చాలకాలం పరీక్షచేసి, వైద్యుడు పూర్తిగా నయమయిందని చెపితేనేగాని, మళ్ళీ ప్రారంభించకూడదు. ఏమెరగని పసిపాపల్ని యీ రోగాలతో పుట్టించేటంత ఘోరం, వాళ్ళని రోగిష్టులుగానో, యే అవయవ లోపంతోనో కనడమంత రాక్షసం యింకోటిలేదు.

తనని నమ్మి తన దగ్గిరికి వొచ్చిన స్త్రీకి పురుషుడు, పురుషుడికి స్త్రీ, యీ రోగాన్ని అతికించడంకూడా చాలా అన్యాయం.

ఈ క్రింద నేను వ్రాస్తున్న పద్ధతుల్ని అనుకరించినట్లయితే యీ సుఖరోగాలు అసలు అంటకండా కాపాడుకోవచ్చు.

కనక శ్రద్ధవహించి అనుమానమున్న విషయంలోనల్లా యీజ్ఞానాన్ని వుపయోగించి,దాన్ని విరివిగా వ్యాపింపచెయ్యాలి.

## పద్ధతి

1 ఇదియేమీ కష్టమైన మార్గంకాదు. తొందరపడి నిరాశపడి, మానెయ్యకూడదు. ఈ రోగాలు రాకండా చేసుకోడం ప్రజలవిధి. ఇతరులయడల, తమ సంసారాల యడల, ముందు రాబొయ్యే ప్రజలయడలఅనుష్టించవలసిన విధి, బాధ్యత, ధర్మం.

2. ఇవి తప్పకండా పనిచేస్తాయి. ఈ మార్గం అవలంబిస్తే, యెటువంటి రోగాలతో సంబంధం కలిగినా అవి అంటవు, నిశ్చయం.

3, కాని రోగం అంటించుకున్న తరవాత యీమందులు ఏమాత్రమూ వుపయోగపడవు. అప్పుడు వెంటనే డాక్టరు దగ్గిరికి వెళ్ళవలిసిందే !

## పురుషులకి

కొనవలసిన మందులు:—

1 పొటాసియమ్పర్మాన్గనేట్ (Pottasium Permanganate)

2 కాలమెల్ ఆయిన్టుమెన్టు (Calomel ointment, special strength, Calomel 3 parts, Lanoline (Hydros) 4 parts White Vasaline 2 parts)

కాలోమెల్ 3 పాళ్ళూ.

లానొలైన్ (హైడ్రాస్) 4 పాళ్ళూ.

తెల్లవాసలైన్ 2 పాళ్ళు.

ఈ రెండుమందులూ అన్ని యింగ్లీషు ఆస్పత్రులలోనూ దొరుకుతాయి. ఏడాక్టర్ని తయారుచేసియిమ్మన్నా యివ్వ గలడు.

ఖరీదు చాలా స్వల్పం.

చెన్నపట్నం యేమందులషాపుకు వ్రాసినా పంపుతారు.

ఈమందులు ముందు తెప్పించి దగ్గర వుంచుకోవాలి. ప్రతిమనిషిదగ్గిరా యివివుండాలి. ఏనిమిషాన యేబుద్ధిపుట్టి యెటువంటి స్థలాని కెడతారో!

అనుమానమున్న స్థలానికి వెళ్లిన వెంటనే యీ చెప్ప బోయ్యే పనులు చెయ్యాలి.

ఒక గంటలోపల చేసితీరాలి. ఎంత త్వరగాచేస్తే అంత మంచిది.

1. అల్పాచమానం చెయ్యాలి.

2. సబ్బునీళ్ళతో ఆస్థలాన్ని బాగా కడగాలి.

3. పొటాసియం పర్మాంగనేటు ఐదుగ్రెయిన్లు, ఒకపెద్ద గ్లాసుడు నీళ్ళలో కరిగించి, శుభ్రమైన దూదిని, దాంట్లోముంచి, ఆ అవయవం ముందు తోలు పైకిలాగి, ఆ దూదితో గట్టిగా రాయాలి. ముఖ్యంగా రంధ్రం దగ్గిరా, తోలుకిందా.

4. తరువాత కాలమెల్ ఆయింట్మెంట్సు, తోలుకింద చర్మానికి యింకేట్టు బాగా రుద్దాలి.

ఇవన్నీ వెంటనే గంటలోపల చెయ్యడానికి వీలులేకపోతే తరువాత 12 గంటలలోగా యీ క్రింది ప్రకారం చెయ్యాలి.

(12 గంటలు దాటితే అట్టే లాభంలేదు)

పైన చెప్పిన నాలుగు పనులూ ముందు చెయ్యాలి. ఆ పైన యిదికూడా చెయ్యాలి.

రెండు చిటికల పొటాసియమ్ పర్మాంగనేట్ రెండు గ్లాసుల నీళ్ళలో కలిపి, చిన్న పిచికారీతో ఆ నీళ్ళని రంధ్రంలోకి మూడుసార్లు పిచికారీ చెయ్యాలి.

(కెథ్రిటల్ సిరింజ్ cathetral syringe అని అమ్ముతుంది మందులషాపులో చిన్న పిచికారీ.)

6. ఆనీళ్ళతో మూడోసారి రంధ్రం నిండిన తరవాత, వేళ్ళతో అవయవపు మూతి బిగించి రెండు నిమిషాలు వుంచి వొదలాలి.

## ఆడవాళ్ళకి

మొగవాళ్ళకు చెప్పిన మందులున్నూ,

డూష్‌డబ్బానూ్నా కావాలి.

(డూష్‌డబ్బా, రబ్బరుగొట్టం, డూష్‌నాజిక్ మందుల షాపులో దొరుకుతాయి).

సంయోగము ముందే:—

1. రెండువేళ్ళకి కాలమెలు ఆయింటుమెంట్ పట్టించుకొని ఆ అవయవము ద్వారముకి అన్ని వేపులా బాగా రుద్దాలి. ముఖ్యంగా రెండు రెప్పలకీ, లోపలివేపు.

2. ఇంకా కొంచెం వేళ్ళతో తీసుకుని, గొంతుకూచుని, వీలైనంత లోపలికి వేలుపోనిచ్చి, అన్ని వేపులా ఆ మందే పట్టించాలి.

(మందు పట్టించే ముందు ఆ భాగాలు నీళ్ళతో కడగకూడదు)

సంభోగమైనతరవాత:—

1. అల్కాచమానం చెయ్యాలి.

2. సబ్బునీళ్ళతో అవయవమంతా కడగాలి.

3. పదిచిటికల పొటాసియం పర్మాంగనేటు పొడుం తీసుకుని, మూడు పెద్ద గ్లాసుల నీళ్ళలో కరిగించి, డూషు డబ్బాలో పోసి, డూషుగొట్టాన్ని బాగా లోపలికి పోనిచ్చి, నీళ్లువొదలాలి.

4. తడి పొయ్యేటట్లు ఆ అవయవాన్ని లోపలాబైటా తుడిచి కాలొమల్ ఆయిన్టుమెన్టు మొదటిమల్లేనే పుయ్యాలి.

ఈ నిరోధవిషయాలూ, (గర్భానికీ, రోగాలకీ,) డాక్టర్లనడిగి ప్రయోజనంలేదు. చాలామందికి తెలియవు. తెలిసినాచాలామంది మూర్ఖులకి నమ్మకంలేదు. వున్నా; లాభంలేదంటారు. ప్రజలకి కడుపులూ జబ్బులూ వొస్తేనేకాని వాళ్లు బతకడమెట్లా!

ఈ ఉపాయాలు సాధ్యంకానప్పుడు రెండోపక్షం ఈలాగు చెయ్యవొచ్చు.

1. ముందుగా ఆఅవయవాలకి వాసలైన్ పట్టిస్తే కొంత రక్షణ కలుగుతుంది.

2. మూత్రంలో ఆరోగాల్ని నిరాకరించే గుణం వుంది. కనక సంభోగమైన వెంటనే అల్కాచమానం చెయ్యాలి. కాట లాగు మందుల్ని నమ్మకండి.

# చిన్నపిల్లలకు జ్ఞానము

కామవిషయమైన జ్ఞానం చిన్నపిల్లలకి సహజంగా యేర్పడదు. వాళ్ళకి యవ్వనం వొచ్చి యీ జ్ఞానోదయమయ్యే వరకూ, వాళ్ళని అజ్ఞానంలో వుంచడం అన్యాయం. అట్లాంటి జ్ఞానము అవసరమయ్యే పరిస్థితులు చిన్నపిల్లల జీవనంలో కూడా చాలా సార్లు కలుగుతో వుంటాయి. సరైన జ్ఞానము లేకపోవడంవల్ల వాళ్ళకి పొరపాట్లూ, బాధలూ తటస్థిస్తున్నాయి. అన్ని విషయాల్లోనూ, పెద్దవారు తమ అనుభవాల వల్ల చిన్నపిల్లలకు సహాయంచేస్తో వుంటారు. నిప్పు కాలుతుందనీ, నీళ్లలో మునిగితే చచ్చిపోతారనీ; పెద్దవారు చెపుతారా, లేక పిల్లలకే తెలుస్తుందిలే అని వూరుకుంటారా? కాని ముఖ్యమైన యీ వాంఛ విషయమై యెవరూ మాట్లాడరు. అడ్డమైన బూతులు పెద్దవాళ్ళూ మాట్లాడతారు. పిల్లలూ మాట్లాడుకుంటున్నారని పెద్దవాళ్లకి తెలుసు. కాని పెద్దలూ, పిల్లలూ కలిసి మాట్లాడడం ఔమర్యాద. అజ్ఞానంవల్ల పిల్లలకు హాని కలిగితే మాత్రం, అప్పుడు పిల్లల్ని తంతారు. వాళ్ల కర్మమంటారు. 'ఈ మాత్రం తెలీదా, యిన్నేళ్లొచ్చాయి' అంటారు.

పెద్దవాళ్లు కళ్లుమూసుకొని పిల్లలకేమీ తెలీదని సంతోషిస్తున్నా, పిల్లలు అజ్ఞానంలో వుంటున్నారా? యెవరి దగ్గిర్నించో కావలసిన సంగతులన్నీ నేర్చుకుంటోనే వున్నారు. ఈవిషయాలు బహిరంగంగా మాట్లాడకూడదని తెలుసుకుని, రహస్యంగా, కుళ్లుగా, బూతులరూపంగా మాట్లాడుకుంటారు.

సగం సరిగా తెలిసీ తెలీని యీ గూఢాభిప్రాయాల్ని ఒకరికి ఇంకొకరు, అసహ్యంచేసి, అబద్ధాలతో నింపి, నేర్పుతారు. ఈ నీచత్వమూ, రహస్యమూ, ఇదంతా ఆచిన్నతనంలో నాటుకుని శాశ్వతంగా వుండిపోతుంది.

ఈ సందేహాలూ, తదుపరిజ్ఞానమూ, లేకుండావుండే పిల్లలు వుండరని చాలామంది తల్లిదండ్రులకి తెలీదు. తెలుసుకోరు. తమ పిల్లలు ఇటువంటి విచారణలేని ఋషీశ్వరులనే వాళ్ళవుద్దేశ్యం. వాళ్ళీజ్ఞానం యెక్కడో సంపాయించారని తెలిసినా, పిల్లలతో, వాళ్ళకాజ్ఞానం యింకా వుండనట్టే ప్రవర్తిస్తారు. సహజంగా యెన్నడూ మాట్లాడరు.

పిల్లలకి చిన్నప్పుడే యీ విషయమై ఆలోచనలూ సందేహాలు కలుగుతాయి. లోకంలో, మనుషులలో, మృగాలలో ఏమీచూడకండా వాళ్ళకళ్ళు కప్పలేరు. పిల్లలు సహజంగా ముందు యీ సంబంధమైన ప్రశ్నలడుగుతారు. కాని పెద్దవాళ్లు ఆ ప్రశ్నలకే నవ్వి వూరుకోడమో, తప్పని కోపపడడమోచేస్తారు. దానివల్ల ఆవిషయమై యేదో రహస్యమున్నదనీ, పెద్దవాళ్ళు చెప్పరనీ తెలుసుకుని, పిల్లలు ఆజ్ఞానంకోసం యితరులని ఆశ్రయిస్తారు,ముఖ్యంగా వాళ్ల స్నేహితుల్ని. ప్రతినిమిషమూ తెలుసుకోవాలని వారికి వుండే సహజమైన ఆసక్తి యీవిషయం తెలుసుకున్నదాకా వారికి నిద్రపట్టనీయదు.

ఇంక కొంతమంది తలిదండ్రులు, పిల్లలు యీ విషయమై మాట్లాడినా, ప్రశ్నించినా, కసురుతారు. అబద్ధాలు చెపుతారు. కనక వారిలో పిల్లలకు విశ్వాసము చెడి, యితరుల్ని ఆశ్రయించి, తెలుసుకుని వారి మాటల్ని నమ్ముతారు.

ఆ యితరులు యీ పిల్లలికి జ్ఞానమిచ్చి అభివృద్ధికి తెచ్చే ఉద్దేశ ముతో మాట్లాడరు. సాధారణముగా ఆ జ్ఞానమిచ్చేవాళ్ళూ ఈ పిల్లలకన్న కొంచెంగానే పెద్దవారు ఐవుండడంవల్ల తమకు తెలిసిన కొంచెము జ్ఞానాన్ని, అనేక అబద్ధాలతో కలిపి, యీ చిన్న శిష్యులకి బోధిస్తారు.

పిల్లలకు రాబోయే ఆపదల్నీ, దురభ్యాసాల్నీ ముందే చెప్పివుంచితే, వాళ్లు వాటి విషయమై జాగ్రత్త తీసుకుంటారు. అప్పటికీ వాటికి లోబడేవాళ్లు సంగతివేరు. కాని అజ్ఞానంవల్ల ముందువాటిల్లోపడి, తప్పించుకోడ మెట్లానో తెలీక, యెవరి తోనూ చెప్పుకోడానికి భయపడి, చివరికవే అలవాటై నాశన మయ్యేవాళ్లు అనేకులు ముందే వాటి అపాయాలూ, అస హ్యమూ, తెలీడంవల్ల జాగ్రత్తపడితీరతారు. స్నేహితుల దగ్గి ర్నించి వాటి ఘోరం తెలీక పిల్లలు తమాషాగా నేర్చుకునే అభ్యాసాలున్నాయి. ఎవరి యెడల భక్తి పిల్లలకువుందో, ఆ పెద్దవారే బాలుల యెడలా, బాలికల యెడలా జరిపే అపచారా లున్నాయి. ఈ ఆపదలన్నీ కూడా జ్ఞానంవల్ల తప్పించుకోడానికి వీలువుంది.

ఇటువంటి దురభ్యాసాలూ, యిటువంటి సహజమైన కార్యాలూ లోకంలో వున్నాయని బిడ్డకి చెపితే, వాళ్ళు వాటిని నేర్చుకోడానికి కారణమౌతామని చాలామంది భయం. పెద్ద వారు చెప్పకపోతే, వాళ్లు నేర్చుకోకుండా వున్నారా? తెలుసు కోకుండా తాళం వెయ్యడం సాధ్యమా? పెద్దవారు గౌరవంగా, ప్రేమతో వొద్దని చెప్పిన హీనకార్యాన్ని, కావలసి పిల్లలు పోయి చేస్తారా? తలితండ్రులపైని యే మాత్రం గౌరవమున్న

వాడూ అట్లా చెయ్యడు. 'సిగరెట్' కాల్చడం అనారోగ్య మని చెప్పగానే వెళ్ళి, బాలుడు కాలుస్తాడా? ఈ అలవాట్లు అట్లాకాదు ఏర్పడేది. సాధారణంగా స్నేహితుల ప్రోత్సాహం ప్రధానం. వాళ్ళమాటవిని, ఆ కార్యాల హీనత్వం తెలుసుకోక, పెద్దవాళ్ళకి తెలిస్తే తంతారని భయంతో రహస్యంగా చేస్తారు. వాటి ఆపదలు తెలీవు. కాని వాటి జ్ఞానం వున్నమాత్రాన నే బాలుడూ ఆచరణలో పెట్టడు.

ఈ కామజ్ఞాన విషయమై పెద్దవాళ్ళు అమితమైన శ్రద్ధ వహించాలి.

1 ఇతరులు జ్ఞానం యివ్వకముందే, తామే తమ పిల్లలకు భక్తితో, ప్రేమతో, యీ జ్ఞాన మివ్వాలి.

2 దానివల్ల ముందే సంభవించబొయ్యే ఆపదలు తెలుసుకుంటారు.

3 ఇప్పుడున్న కుమానా పవిత్రతాభిప్రాయాలకు లోబడక, కామమంటేనే రహస్యంగా బూతుగా చూడక, ధైర్యంగా సహజంగా, ఆరోగ్యంగా ఆలోచించుకునే విధం నేర్పాలి.

4 స్త్రీనీ, స్త్రీ సాంగత్యాన్నీ, హీనంగా, నీచంగా, అపవిత్రంగా, చూడక, తగిన గౌరవం యిచ్చేట్టు నేర్పాలి.

5 తమలో క్రమంగా అభివృద్ధి పొందే శక్తుల్నీ, వాంఛల్నీ, యెట్లా వినియోగపరచాలో, యేది, ఆరోగ్యమో, యేది హానికరమో నిర్ణయించుకోవాలి.

ఈ విషయమై సంపూర్ణంగా చర్చించడానికి యిది స్థలం కాదు. కాని ప్రస్తుతాంశానికి సంబంధించిన విషయాలుమాత్రం వ్రాయడం అవసరం.

ముఖ్యంగా పెద్దవారు యీ విషయమై శ్రద్ధవహించాలి. ఈ కామ విషయాలను, రహస్యంగా బూతుగా, అపరాధంగా, అసహ్యాంగా చూడక, దినజీవితంలో వాటి విషయమై మాట్లాడ వలసివొచ్చినప్పుడు తడుముకోక సహజంగా మాట్లాడాలి. పెద్దవారు సంపూర్ణ విశ్వాసమిచ్చినప్పుడు పిల్లలు ప్రశ్నలు వేసి తీరతారు. ప్రశ్న వేసినట్టయితే, అది యెటువంటి ప్రశ్న కానీ, కొంచెమైనా దాపరికమూ, మోసమూ లేకండా స్పష్టంగా చెప్పాలి. యీ విషయమై పిల్లలు తెలుసుకోవలసిన జ్ఞానం రెండు విధాలు.

1 చిన్నతనంలో అవసరమైనది.

ఇది సృష్టి యెట్లా జరుగుతోందో, యితర పిల్లలు బాలుడికీ, బాలికకూ, చెడుఅలవాట్లు నేర్పుతారనీ, వీరితో కలిసి చెడుపనులు చేస్తారనీ, ఆ అలవాట్లు అసహ్యమైన కార్యాలనీ, పెద్దవారుకూడా పిల్లల్ని పాడుచేసేవారు వున్నారనీ, వాటికి లొంగవద్దనీ యిట్లాంటివి యెవరన్నా పిల్లల్ని అక్రమంగా బలవంతం చేస్తే, పెద్దవారితో చెపితే, ఆ నేరస్తుల్ని శిక్షిస్తామని నిశ్చయంగా చెప్పాలి. బిడ్డలు తప్పుచేసినా భయపడక, పెద్ద వాళ్ళతో చెప్పి, ఆఅలవాటునించి తప్పించుకునే వుపాయం ఆలోచించుకునే పద్ధతి నేర్పాలి. చేసిన తప్పుకై పెద్దవాళ్ళు శిక్షించారా, పిల్లవాడు యింక యేమీ వాళ్ళతో చెప్పడు; రహస్యంగా చేస్తాడు. కనక ప్రేమతో అతని వ్యవహారం విని, ఆలోచించి అతనికి కావలసిన సహాయం చెయ్యడానికి పెద్ద వాళ్ళు వినియోగపడాలి. అట్లా చేస్తారనే విశ్వాసం పిల్లవాడికి కుదర్చాలి.



పిల్లవా డీవిషయాలు ప్రశ్నించకపోయినా పెద్దవారే జోక్యం కలగచేసుకుని యీ ఆపదలను గురించి మాట్లాడి యీ సృష్టివిషయాలను పాఠములవలెనే నేర్పాలి.

2 యవ్వనంలో వుపయోగపడేవి.

యివి పిల్లవాడికి యవ్వనం వొచ్చే ముందే నేర్పాలి. యౌవ్వనచిన్హాలు, యవ్వనంవల్ల కలిగే జబ్బులు, వాటిభయాలు నష్టాలూ, స్త్రీపురుష సంపర్కం, పవిత్రత, పరిజాభిప్రాయం, నీతిచట్టాలూ, వాటి వాస్తవమైన విలువా, బ్రహ్మచర్యం, గర్భనివృత్తి మార్గాలూ, సుఖరోగాలూ, నివృత్తి మార్గాలూ, వివాహమూ, దాని అర్థమూ, సంఘాచారమూ మొదలైనవి.

"ఈవిషయమై ఇంకా జ్ఞానము కావాలంటే నేనువ్రాసిన బిడ్డలశిక్షణ చదవండి."

——o——

# గర్భం

గర్భాన్ని పదినెలలు మొయ్యడమనే విషయం స్త్రీ జీవితంలో గొప్పమార్పుల్ని కలిగించింది. పురుషుడికన్న ఆమెని సృష్టిసూత్రానికీ emotions కీ, రహస్యానికీ సన్నిహితురాల్ని చేసింది. ఆ గర్భంవల్ల ఆమె పడే యాతనా, కనేనెప్పులూ, బాధా అటుంచి, గర్భం ఎదుగుతో వుండగా, పిల్ల కదలుతో వుండగా, పాలుపడుతో వుండగా, బిడ్డ తాకినప్పుడూ, పాలు తాగినప్పుడూ ఆమెకి కలిగే ఆనందాన్ని పురుషుడు ఎన్నడూ ఎరగలేడు. కాని కాలం మారుతున్న కొద్దీ, స్త్రీ నైజం నశిస్తున్న కొద్దీ యీ ఆనందాలు తక్కువై బాధలు ఎక్కువవుతున్నాయి. ఈ గర్భత్వం స్త్రీని బానిసని అబలను, అధీనురాల్ని చేసింది. గొప్ప ఎడ తెగనీ చిక్కువీడనీ సమస్యలో పడేసింది.

ఈ కొత్తకాలపు ఆర్థిక, రాజకీయ, నైతికమైన మార్పులవల్ల, చాలమంది స్త్రీలకి, సంసారాలు పెనుభూతాలైనాయి. ఎట్లాగన్నా పురుషుల అధికారాన్నించి తప్పించుకోవాలనిచూస్తున్నారు; ఇంకా ముందు చాలామంది చూస్తారు. మొన్న మొన్నటి దాకా పురుషుడితో సంబంధంలేకపోతే గర్భంరావడానికి - వీలు లేకండా వుండేది. ఇప్పుడూ ఆసంగతి కొంత ఎక్సుపెరిమెంటుగానే వుంది. (Test Tube Babies) గర్భం లేకపోతే పిల్లలు వుండరు. పురుషులకన్న స్త్రీలకి గర్భమూ, పిల్లలూ చాలా జీవితంలో పెనవేసుకున్నట్టు అవసరం కల్పిస్తున్నారు. ఎన్నివున్నా పిల్లలేక

పోతే స్త్రీ జీవితానికి తృప్తివుండదు. పిల్లలులేకండా ఎండిపోయి నిరర్థకత్వమనే బాధతో అణగారాలి. లేకపోతే పెళ్లిచేసుకుని పురుషుడి అధికారాన్ని భరించాలి. లేకపోతే తాత్కాలికంగానన్నా పురుష సహవాసాన్ని కోరాలి. దీనికి సంఘం అంగీకరించదు.

పురుషుడి ఆధిక్యతా, సహవాసమూ లేకండానే శాస్త్రరీత్యా స్త్రీలను తల్లుల్ని చేస్తున్న యీకాలంలో, తను గర్భవతి కావడానికీ కాకపోవడానికీ, పూర్తిగా శిశువుని కనడానికీ కనకపోవడానికీ స్వతంత్రాన్ని సంపాయించాలి స్త్రీ. స్త్రీలు వోట్లూ పాఠశాలలూ పెళ్లిళ్లూ వీటిల్లో మార్పులు కోరుతున్నారు. నీతి విషయంలో మార్పు కావాలనడానికి వాళ్లకి గుండెలేదు; తమ మర్యాదకి ఎక్కడ భంగం కలుగుతుందోఅని భయం. భద్రంగా ఇతరదేశాలలో స్త్రీలు ఇట్లాంటివి అడిగారా, పురుషులు ఆమోదిస్తారా, ఇది మన ఘనతకి అనుకూలమా అని యోచించి, మరీ 'రిజల్యూషన్లు' కానిస్తారు. తమకి స్వతంత్రం కావాలని కోరడంకన్న, పురుషులకి స్వతంత్రత వుండిపోయిందనే ఏడుపులో శాసనాలవల్ల బంధించాలని చూస్తున్నారు. పురుషుడిద్వారా, ఇంకో జీవిని తమలో ప్రవేశపెట్టుకుని, ఆశక్తులై పోయినన్నాళ్లు దానిమూలాన పురుషులమీదా, సంఘంమీదా ఆధారపడుతున్నన్నాళ్లు, స్త్రీకి స్వేచ్ఛలేదు. గర్భవతి సంపాయించుకోలేదు, ఎదిరించి వెళ్లలేదు. పిల్ల పుట్టింతరవాత ఆపిల్లతో సేవతో, కదలలేదు. ఎందరు స్వతంత్రాభిలాషులు పిల్లలమీదిప్రేమతో, పిల్లల బంధంలోంచి తప్పించుకోలేక పంజరాల్లో పడి వున్నారు శాశ్వతంగా - తమ ఆశయాలు,

కోర్కెలు, కలలు అన్నీ చంపుకుని! పిల్లల్ని వొదిలి వెళ్ళిందా, హృదయం ఒక్కరవ్వవిశ్రాంతినివ్వదు. ఈపిల్లలమీదిన్యాయాధికారాన్ని చేతులోపెట్టుకుని ఎందరు దుష్టులు స్త్రీలని తమ బానిసలుగా వుంచుకోటంలేదు!

పిల్లనికనని స్త్రీ జీవితం అసంపూర్ణం. తృప్తిపొందని మాతృత్వం ఆమెనికాల్చి జీవితాన్ని శూన్యంగా తోపిస్తుంది. కనక తల్లుల వుద్యోగం గొప్పదిగా ప్రభుత్వంవారు పరిగణించి, భర్తతోవుండకపోనీ, వారిని పోషించే బాధ్యత వహించేవరకు, పిల్లలమీద తండ్రికన్న తల్లికే ఎక్కువ ఆధిక్యతను ఇచ్చేవరకు స్త్రీలు ఆందోళన చెయ్యాలి. తమ హృదయానికి దగ్గిరిగావుండి, జీవితాల్ని పరిపాలించే యీ మార్పుల్ని వొదిలి, వోట్లకూ, సీట్లకూ, పెనుగులాడుతున్నారు స్త్రీలు. ఆవోట్లూ సీట్లూ దొరకగానే, మర్యాదలు, టీపార్టీలూ, అలంకారాలూ తమ పిల్లలకి ఉద్యోగాలూ, కట్నాలూ, గొప్పవియ్యంకులూ, ఇదీ ధ్యాస.

సృష్టి తన స్తిరత్వంకోసం యీ కామశక్తిని అనివార్యంగాచేసి స్త్రీ పురుషుల్ని ఉపయోగించుకుంటోంది. ఇదివరకంతా యీశ్వరుడిచేతులో ఉన్న సంతానదానం, గర్భనివృత్తి మార్గాలు కనిపెట్టిం తరవాత మనుషుల చేతుల్లోకి దిగింది. సృష్టి స్త్రీలను మరీలోకువచేసుకుని పదినెలలు ఇంకో జీవిని భరించి పోషించమని ఆమె శరీరంలో అతికిస్తోంది. ఈ గర్భిణిత్వం స్త్రీ బానిసత్వానికి ప్రబలకారణమయింది. ఈనాటికికూడా స్వేచ్ఛని కోరే భార్యల్ని అణిచివుంచడానికి ప్రతియేటా ఆమెకి గర్భం

తెప్పించి రెక్కలు విరిచి తమ ప్రతిష్ఠని నిలపెట్టుకునే భర్తలు వున్నారు.

గర్భం ధరించి పిల్లల్ని కనడంవల్ల స్త్రీ దేశప్రభుత్వానికి గొప్ప సేవ చేస్తోంది.

టీచర్లకీ, డాక్టర్లకీ, గుమాస్తాలకీ, జీతాలిచ్చే ప్రభుత్వం తల్లులకు జీతాలియ్యడంలేదు. భర్తలద్వారా ఇస్తున్నామంటారు. మరి భర్తలు లేకండా బిడ్డల్ని కనే స్త్రీలు యీ ప్రకారం, జీతంలేని దేశసేవకులలో జత అవుతారు. న్యాయంగాపడితే వారికి ప్రత్యేకం జీతాలు ఏర్పరచాలి.

కామం తీర్చుకోక ఎండిపోయిన స్త్రీ అంత రాక్షసి ఇంకోరు వుండరు. ఆ కామశక్తిని ఊర్ధ్వముఖంగా తిప్పగలిగిన గడిచినకాలపు వితంతువులూ, కొందరు మిషనరీ స్త్రీలూ తప్ప! వాళ్ళలో వెలిగే మతావేశం ముఖానికీ హృదయానికీ సౌందర్యాన్నిచ్చేది. ఏమత ఆధ్యాత్మిక సాంప్రదాయమూ విశ్వాసమూ లేక, ప్రతిష్ఠదేవతనే ఆరాధించే యీ నవ్య విద్యావతికి అధికార పదవిని స్తే—పెళ్ళిచేసుకోదు, పెళ్ళిచేసుకుంటే అధికారం చలాయించి భర్తని వెళ్ళకొడుతుంది, ఇంకో పురుషుణ్ణి దగ్గిర చేరనియ్యడానికి గర్వం—అపకీర్తి భయం — కామంమీాద అనుమానం — మళ్ళీకోర్కె — ఇట్లా శుష్కించి తన అధికారంద్వారా, తనకి అందినవాళ్ళనందర్ని క్షోభపెడుతుంది. చాలామంది ఆడపిల్లలు చేతికింద దొరికే యీ హైస్కూళ్ల ఆడటీచర్లూ, ఆడ ఇన్‌స్పెక్టర్లూ — గొప్పతార్కాణం.

పురుష సుఖం పొందుతున్నట్టూ, పిల్లలు కలుగుతున్నట్టూ రూఢిపరచలేని స్త్రీలను పాఠశాలలో ఉండనీకూడదు.

నపుంసకులూ, ఆత్మవిద్యాసంపన్నులూ కాక, తక్కినవారు శరీర విధంగా తృప్తిపడకపోతే సంఘంలో స్థానం తీసుకోడానికి అనర్హులు.

గర్భం రావడంవల్లా, పిల్లలు కనడంవల్లా, ఏమాత్రమూ, తమ గౌరవానికీ, ఆర్థిక స్వాతంత్ర్యానికీ, శరీరారోగ్యానికీ, భంగం కలగకండా, దేశమూ, సంఘమూ, వీళ్ళు కలిగించేటంతవరకు స్త్రీలు ఆందోళనచెయ్యాలి.

---

# గర్భస్రావం - బాగువోగులు.



సృష్టి తాను కొనసాగడానికి పురుషుల్నీ స్త్రీలనూ వుపయోగించుకుంటోంది. కాని పురుషుడి బాధ్యత ఆ నిమిషంతో తీరిపోతోంది. స్త్రీది పది నెలలవరకూ తీరదు. అనారోగ్యమూ, భారమూ, ప్రసవవేదనా, అన్నీ స్త్రీ పాలిట పడ్డాయి. శిశు ఉదయానికి తన సౌఖ్యాన్నీ ప్రాణాన్నీ ధారబోసే యీ స్త్రీని సంఘం యెంతో గౌరవించి పూజించవలసింది. సృష్టి ఆమెని యిట్లా వుపయోగిస్తుందనే దుర్బల విషయాన్ని పురస్కరించుకుని సంఘం ఆమె పైని కఠినత్వాన్నీ, నిర్దయనూ చూపడానికి వీలుకలుగచేసుకుంది.

శిశువుని స్త్రీ కనడమే సృష్టికి ప్రధానంగాని, నీతిగానా, అవినీతిగానా, భర్తకా, కులంవాడికేనా, వరసగలవాడికా, కాదా, అనే ప్రశ్నలులేవు. తల్లి కొడుక్కీ, తండ్రీ కూతురుకీ సృష్టికి తోడ్పడ్డా సృష్టికి అభ్యంతరంలేదు. ఈ నీతులూ, పద్ధతులూ, అన్నీ మనుషులు తాత్కాలికంగా యేర్పరచుకున్నవే! కాని సంఘం నిర్దేశించిన భర్తకో, లేక సంఘం కళ్ళు కప్పి భర్త పేరుకిందో బిడ్డని కనకపోతే, స్త్రీకి కష్టాలు తటస్తిస్తున్నాయి. మొగవాడు సులభంగా తప్పించుకుంటాడు. భర్త లేని స్త్రీ యెప్పుడూ గర్భమనే భయంకర పిశాచంవల్ల భయపడుతోనే వుంటుంది.

సృష్టికి సాయపడే కార్యం మొదలు కనేవరకూ ఆనందంతో, సంతుష్టితో, గర్వంతో పొంగిపోవలసిన మాతృహృదయం, పాపం అన్నిగంటలూ, అన్ని దినాలూ, భయపడుతో, ద్వేషించుకుంటో, మరణమే శరణ్యంగా చేసుకోవలసి వొస్తోంది. ఆ గర్భాన్ని దాచుకోవాలనీ, తను ప్రేమించే శిశువును నాశనం చెయ్యాలనీ, యెన్నో ప్రయత్నాలు రహస్యంగా జరుగుతున్నాయి. పోనీ స్త్రీని కఠినంగా చూసినా, ముందు సంఘంలో మనిషి కాబొయ్యే ఆ శిశువునన్నా ఆరోగ్యవంతంగాచూసి, బుద్ధిమంతుణ్ణి చెయ్యాలనే బుద్ధిలేదు, ప్రజలకి. తమ ఆజ్ఞను మీరి, తమ యాజ్ఞ లేనిది పుట్టినందులకు క్రోధమేగాని!

గర్భస్థురాలైన స్త్రీ ఆనందంగా వుండాలనీ, ఆరోగ్యంగా వుండాలనీ, ప్రతి శాస్త్రమూ వాగుతోంది. కాని తమ శాసనానికి తప్పిజారి కనే స్త్రీని సంఘం పెట్టే తిప్పలు, యింతవరకు యే రాజ్యమూ, యెటువంటి తప్పుచేసిన వారినీ పెట్టలేదు. ఈ స్త్రీలు, యీ గర్భిణులు పడే వేదన, తమ ప్రేమకూ, తమ ప్రతిష్టకూ మధ్య నలిగి, అనేక దారుణ కష్టాలకు పాలై తమనూ, తమ సంతతినీ, నాశనం చేసుకుంటున్నారు.

ఈ విధంగా సృష్టీ, సంఘమూ, తమకి తోడ్పడే స్త్రీని హింసించడం క్రూరం, అన్యాయం, అధికారమేమాత్రమూ లేని పని, మూర్ఖం. సంతాన నిరోధపద్ధతులు ఆమెకి చాలా సహాయంచేస్తున్నాయి. అవి విరివిగా ప్రచారంలోకి రావాలి.

గర్భం తెప్పించి పురుషుడు నట్టేట్లో విడిచిపోతే, ఆ స్త్రీలు గర్భనిర్మూలన మార్గాలకై ప్రయత్నిస్తారు. తెలియక, అనేక కుహనామార్గాల ఆప్రయత్నాలుచేసి, మృత్యువు పాల

బడే సంఖ్యని కనుక్కున్నట్లయితే సంవత్సరానికి ఎన్ని లక్షలో ! తమ గర్భాన్ని తీసేసుకునే ప్రయత్నాన్ని ప్రభుత్వంవారి శాసనము ఏడేళ్ళ కైదుతో శిక్షిస్తోంది.

ఆ గర్భానికి కారణమైన పురుషుణ్ణి శిక్షించరు, గర్భిణివైన స్త్రీని రక్షించరు, సంఘదౌర్జన్యం లేకండా కాపాడరు. పోనీ కనేందుకు, ఆ కనేబాధలోనన్నా ఒక్కదమ్మిడీ యివ్వరు. పోనీ ఆ పుట్టిన చిన్నబిడ్డనన్నా కాపాడరు, కాని ఆబిడ్డ అనే ఆపదనించి తప్పించుకోడానికి ప్రయత్నిస్తే శిక్షిస్తారు ! ఏం తెలివి ! ఏంన్యాయం !

ఈ భ్రూణహత్యకి అనేకమార్గాలున్నాయి; నాటువి, యింగ్లీషువి. ఏది ఐనా ఆరోగ్యానికి మంచిదికాదు. కాని ఇంక నెత్తిమీదికి వొచ్చినప్పుడు ప్రాణం పోవడమే నయమనుకున్నప్పుడు, సర్వ బంధు, మిత్ర, పుత్రత్యాగం చెయ్యవలిసిన సమయాన, ఆరోగ్యం సంగతి చూసుకుంటారా !

ఇప్పటికైనా అన్యాయంగా గర్భవతులైన స్త్రీలను స్వీకరించి ఆదరించి, వారిని పోషించి, ఆబిడ్డలకు తగిన పోషణను ఏర్పరిచే ఉదారుల సంఘాలు దేశమంతటా యేర్పడాలి.

కష్టములో వున్న స్త్రీల విషయం తెలిసినవారు:-

డాక్టరు రంగనాయకమ్మగారు,
బె జ వా డ.

అని వ్రాసి సహాయం పొందగలరు.

సంఘ బాధను పొందే స్త్రీలను రక్షించి, విశ్రాంతినిచ్చి పోషించి, కాన్పును చెయ్యడానికి అక్కడ వీళ్ళు కలగచెయ్యబడుతున్నాయి.

## గర్భస్రావం (abortion) మూడు విధాలు.

1. దానంతట అది సంభవించేది. దీనికి అనేక కారణాలు వుంటాయి. ముఖ్యం స్త్రీ దేహంలో బలహీనం, గర్భకోశంలో బలహీనం, జబ్బు, సిఫిలిస్ వంటి సుఖరోగమూ లేక స్త్రీ పడడమూ అదరడమూ భయమూ కారణాలు కావొచ్చు.

2. స్త్రీ క్షేమంకోసం డాక్టరు బహిరంగంగా చేసేది. లోపలి పిండాన్ని ఎదగనిచ్చి స్త్రీ బిడ్డని మామూలుగా కంటే, ఆమెకి ప్రాణహాని కలుగుతుందని భయపడ్డప్పుడే చెయ్యడానికి డాక్టరుకి న్యాయరీత్యా అధికారంవుంది. స్త్రీలో బలహీనంగాని పాండురోగంగాని, కనేమార్గం అభ్యంతరం కలగచెయ్యడంగాని, ముఖ్యకారణాలుగా వుంటాయి.

3. రహస్యంగా జరపబడేది. ఇది బలవంతంగా పిండాన్ని విచ్ఛిత్తు చెయ్యడం. ఇది మూడు రకాలు.

1. స్త్రీ తానే ప్రయత్నించి కానిచ్చేది.

2. డాక్టరుకానివాళ్ళ చేత కానివ్వబడేది- మంత్రసానులు, ఎరికలమ్మలు, మందులవాళ్ళు మొదలైన వాళ్ళ చేత.

3. సర్టిఫికెటువున్న డాక్టర్లచేత చేయించుకునేది.

ఈ మూడు విధాలూకూడా న్యాయచట్టానికి విరుద్ధాలు, కనక రహస్యంగా జరుగుతాయి.

### కారణాలు.

1. సంఘబహిష్కరణ- కన్యలు, పతితంతువులు.

2. భర్తదగ్గరలేని భార్యలు- మళ్ళీ భర్త అంగీకరించడని భయం.

3. పిల్లల్ని కనే శ్రమగాని, పెంచేశ్రమగాని, పోషించే శ్రమగాని పడలేకపోవడం.

4. ఆ స్త్రీ భాగ్యాలై పోతుందని, పిల్లలసంఖ్య తగ్గించుకోవాలనే కోర్కె.

5. పిల్లల్ని పెంచే ధనంలేకపోవడం.

6. పిల్లలు బాధపడిపోతారని ఆదుర్దా, దయ.

7. ఆడపిల్లలు మాత్రం అక్కర్లేకపోవడం.

ఎంతమంది పిల్లలువుంటే అంత ఖలగంగానూ ఆ స్త్రీగానూ, అనుకునే రోజులూ, అంత పూర్వజన్మసుకృతంగా, ఉత్తరజన్మ సార్థకంగా చూసుకునే రోజులూ పోయినాయి. జనసంఖ్య హెచ్చడమూ, నిరుద్యోగ సమస్యా, దేశదారిద్ర్యమూ ముఖ్య కారణాలు. కనక సంసారులుకూడా (వాళ్ళే ఎక్కువగా) గర్భ స్రావాన్ని కోరుతున్నారు. గర్భనిరోధక మార్గాలు విరివిగా ప్రచారంచేస్తే యీ అవసరం చాలవరకు తగ్గుతుంది. అప్పటికీ, బద్ధకంవల్లనూ, అదృష్టంలో నమ్మకంవల్లనూ, 'ఆఁ ఈసారి కేం?' అనుకోడంవల్లనూ, అనుకోకుండానే గర్భాలు వొస్తోనేవుంటాయి. వొచ్చిందాకా వాటి ఉపద్రవం మనసుకి తట్టదు. భర్త లేకండా గర్భాలు తెచ్చుకుంటున్న స్త్రీలందరికీ ఈ అనుభవం చాలా సన్నిహితం. తండ్రిలేకండా పుట్టే పిల్లలమీదా, ఆతల్లుల మీదా సంఘం కౌర్యంచూపుతున్నన్నాళ్లు, ఎన్నినిబంధన లేర్పరచినా, యీ గర్భస్రావాలు ఆగవు. ఎదిగిన పిల్లలకే పెళ్ళిళ్ళు చెయ్యమని శాసనం వొచ్చిందికదా, క్రమంగా యీ గర్భస్రావాల practice డాక్టర్లకి హెచ్చుతుంది. చాలా పూర్వాచారపరులూ, గొప్ప సంఘసంస్కారులూ, వీళ్లుకూడా

భూతదయ అని గొప్ప ప్రచారాలు చేసినవారుకూడా, తమ కూతుళ్ళు కనకండా రహస్యంగా గర్భస్రావాలు చేయించి, నమ్మకంగా పెళ్ళిళ్ళు చేసేశారు; చేస్తున్నారు. ఎంత గొప్పసంఘ సంస్కర్తలైనా, ఎంత విశాలమైన విజ్ఞానంవున్నా పశ్చిమశాస్త్ర వేదాంతపండితులైనా, తమ పిల్లలకి 'పెళ్ళి, పెళ్ళి' అని ఆదుర్దా పడడం యీ గర్భాల భయంవల్లనే. తమ కూతుళ్ళకి వితంతు వివాహంకన్న, వ్యభిచారం నయమని వొప్పుకుని చూసీ చూడనట్టు వొదిలే ఛాందసులు లేరూ? అదే రకం యీ నవీన రిఫార్మర్లుకూడా! పై పెచ్చు లెక్చర్లలో డాబులుకొట్టి, హిందూ స్త్రీ మనోనిబ్బరంమీద పాతివ్రత్యంమీద పొగడ్తలు పోసి, ఇంటిదగ్గర కూతుళ్ళ పెళ్ళిళ్ళకని బెంగపడి మంచమెక్కుతారు. వాళ్ళకి గర్భంరాగానే దొంగతనంగా డాక్టర్ల దగ్గరికి పంపిస్తారు.

బలవంతమైన గర్భస్రావాన్ని పుణ్యులు భ్రూణహత్య అని పిలుస్తారు—ముఖ్యం ఇతర కుటుంబాలలో జరిగిన వాటిని. ఇది పాతకమంటారు. ప్రజానీతిగాని, న్యాయచట్టంగాని ఏదీ దీన్ని అంగీకరించదు. ఎందుచేత!

న్యాయచట్టాన్ని ప్రశ్నించి ఆట్టే లాభంలేదు. ఇట్లాంటి అర్థవిహీనమైన పురాతనచట్టాలు చాలావున్నాయి. సాంప్రదాయం అంటుంది 'లా'. నీతికర్తల్ని అడిగి అంతకన్నా లాభంలేదు; దేవుణ్ణి ఇసుగ్గొలుపుతారు మనమీదికి. ప్రత్యుత్తరాలూ, ప్రత్యుత్తరాలకి ప్రత్యుత్తరాలూ మనమే చెప్పుకోవాలి.

మనుషుల్ని ఎందుకు చంపకూడదో, అందుకునే పిండాన్ని నాశనం చెయ్యకూడదు అంటే—అసలు ప్రాణమంటే ఏమిటి?

ఆత్మ అనేది ఏమిటి? అసలు వుందా? వుంటే ఆ ప్రాణమూ, ఆత్మా ఎప్పుడు ప్రవేశిస్తాయి? ఏమార్గాన? తలితండ్రుల శ్రీమ కనిపెడుతో ప్రవేశించడానికి కాచుకునివుంటాయా గాలి లో, గదిలో! ఇవి ఎవరూ చెప్పలేని సంగతులు.

వైద్యశాస్త్రరీత్యా మూడోనెల దాటేంతరవాతగాని భిన్నత్వం ఏర్పడదు పిండానికి. అందువల్ల మూడోనెల లోపల హత్యకాదని కొందరి అభిప్రాయం. మరి పిండం బిడ్డతో సమానమే ఐతే, మనిషి చస్తే ఎట్లా మైలపడతారో, కర్మచేస్తారో అట్లా చెయ్యరేం పిండానికి? కనక ప్రాణమూ, ఆత్మా లేవన్న మాట! పుట్టేవరకూ తల్లిలో ఒక కురుపులాగు పెరుగుతోంది అన్నమాట.

భ్రూణహత్యచేస్తే, దేశానికి ఒక ప్రాణనష్టమౌతోంది గనక, ఆత్మహత్యకి ఉన్న అభ్యంతరమే దీనికి ఉంది అంటారు కొందరు. మరి జనసంఖ్య పెరుగుతోంది, తిండి చాలడంలేద నేగా, ఆందోళనపడుతున్నారు! అట్లా అయితే జనసంఖ్య కోసం, యీ వితంతువుల్ని, భర్తలేనిస్త్రీలనీ, పిల్లల్ని పుట్టించు కోమని శాసించాలి. పుట్టించుకోడానికి, పెంచుకోడానికి అన్ని సౌకర్యాలూ కలగచెయ్యాలి. మరి భర్త వున్నాడా లేడా అని కూడా చూసుకోకండా దేశానికి బిడ్డని ప్రసాదించే తల్లి ఎంత గొప్ప వీరవనిత! దేశసేవాపరురాలు!

తల్లి ఆరోగ్యం చెడుతుంది అంటారు. దొంగతనంగా యీపనిచేస్తే, మరణంకూడా తటస్థిస్తుందిగాని, బహిరంగంగా సరైన డాక్టర్లుచేస్తే ఏఅపాయమూలేదు.

తిరిగీ కాన్పువస్తే భార్య చస్తుందని డాక్టరు చెప్పినా, మళ్ళీ గర్భం తెప్పించి భార్యని చంపుకుని, దేవుడినెత్తిమీద పారేసినవాళ్ళే, స్త్రీ ఆరోగ్యం చెడుతుందనే కారణాన్ని ఇళ్ళకప్పు లెక్క అరిచేది.

భ్రూణహత్య చెయ్యకపోతే భర్తలేనిస్త్రీకి వేరే alternatives ఏమిటి? పిల్లను కని పారెయ్యాలి—లేక చంపి పారెయ్యాలి. కని పెంచుకోవాలి.

ఈ మూటివల్లా కలిగే యిబ్బందులు భ్రూణహత్య యిబ్బందులకన్న ఎక్కువైనవే కాని తక్కువైనవి కావు.

పోనీ తల్లి ఏదోపాపంచేసిందని వొప్పుకున్నా, ఆబిడ్డ ఏం పాపంచేసి సంఘ ఆగ్రహానికి బలి అవుతున్నదో కర్మవేదాంతులకే తెలియాలి.

యూరప్‌లో కొన్ని ప్రభుత్వాలు కొన్ని కారణాల్ని అంగీకరించి డాక్టర్లకి గర్భస్రావంచేసే అధికారాన్ని ఇచ్చాయి.

(1) బలవంతంగా ఇతర పురుషుడు గర్భం తెప్పించినపుడు.

(2) రోగిష్టి, వికలాంగి, జన్మదుర్మతీ, మొదలైన వాళ్ళు పుట్టుతారని రూఢిఐనప్పుడు.

(3) స్త్రీ ఆరోగ్యంగాని, మనోస్తిమితంగాని శాశ్వతంగా భంగమవుతుందని తెలిసినప్పుడు.

ఇంకాకొన్ని ఇట్లాంటి కారణాలు కనపడ్డప్పుడు.

ఈ వుద్దేశ్యాల ననుసరించి, స్త్రీలబాధల్ని గమనించి 'లా' కఠినంగావున్నా, జడ్జీలు కనికరించి స్వల్పశిక్షలతో వొదులుతున్నారు యీపనిచేసిన స్త్రీలనీ డాక్టర్లనీ. పతివ్రతా

వాసనలు వొదలని యీదేశం, పతివ్రతలుకానివాళ్ళని వొదులుతుందిగాని, పతివ్రతలంకాము అన్నవాళ్ళని అతికఠినంగా శిక్షిస్తుంది. "మాకు పతులులేరు గనక తాత్కాలికంగా పతుల్ని కష్టపడి సంపాయించుకుని పాతివ్రత్యంచేసి తెచ్చుకున్న ఫలం! ఇది" అని చెప్పినా కనికరించదు.

భర్తలు ఉన్న స్త్రీలకిలేని నిబ్బరమూ, నిగ్రహమూ, భర్తలు లేని స్త్రీలకు వుండి తీరాలని శాసనము.

కాని ఎంత శాసించినా యీ గర్భస్రావాలు మితిమీరి పోతున్నాయి. సరిగా బహిష్టలు కావటంలేదనీ, కడుపులో బల్లలనీ అనేక వంకలతో డాక్టర్ల దగ్గిర మందులు భర్తలు ఉన్న వాళ్ళూ లేనివాళ్ళుకూడా తీసుకువెడుతున్నారు, ఏ రెండు మాత్రలతోనో తమ పని గడుస్తుందనే వెర్రి ఆశలతో. డబ్బు ఉన్నవాళ్ళకి యీ పని సులభంగా తీరిపోతోంది. ఎప్పటికో వీళ్ళందరూ నరకానికి పోతారనీ, వీళ్ళందరూ నీతిమీరుతున్నారనీ అరిచే తమ అరుపులూ, ఏడ్చే ఏడుపులూ పాపాత్ముల్ని తాము పెట్టే శ్రమలూ గమనించి మెచ్చి యీశ్వరుడు తమకి మాత్రం స్వర్గం యిస్తాడని సమ్మకంలేని నమ్మకాలు తప్ప ఇంకేమీ మిగల లేదు, యీ పుణ్యాసతులకీ, గోత్రాలు ఎందు పంతులమ్మలకీ.

ఏనాటువైద్యమోచేసి గర్భం విచ్ఛిన్నం చేసుకుని, ఆ అవయవాలు వాచి, ముడిగి, పుళ్ళు పడి, వొంటో నెత్తురంతా పోయి, 'ఏదో జబ్బుగావుంది. చూడండీ', అంటో ఏమెరగనట్టు మందుకోసం వొచ్చేవాళ్ళు ఎంత మంది? డాక్టర్లు కనుక్కోలేరనే వాళ్ల అభిప్రాయం! డాక్టర్లూ ఎరగనట్టే మందిచ్చి పంపుతారు. ఈ మోసాలకి ఆ స్త్రీలని నిందించి ఏంప్రయోజనం!

గర్భిణి అని అందరికీ తెలిసినా, నోరూ డబ్బూగల స్త్రీ కడుపులో బల్ల అని వాదించి, ఎక్కడికోవెళ్లి కని తిరిగి వొచ్చి సంఘంలో క్షేమంగా బతుకుతోంది. ఆ తెలివీ, కపటమూ, ధనమూ లేని అనాధ, నిందలుపడి, పారిపోయి, కుక్కల పాలవుతోంది. సంఘం ఇంత తెలివిగా వ్యవహరిస్తోంది, నీతులనే పేరుతో. ధనంగల స్త్రీ గొప్ప డాక్టర్లచేత సుఖంగా అపాయమూ బాధా లేకండా ఆపరేషన్ చేయించుకుంటోంది. బీద స్త్రీ పిల్లని కని వెలిపడి, బీదతనంవల్ల సరిగా పెంచలేక బాధపడుతోంది. లేకపోతే ఏనాటు వైద్యమో చేయించుకుని యమబాధ పడి చచ్చిపోతోంది. నీతులన్నీ ధనం వెనకాల దాక్కున్నాయి యీ కాలంలో.

గర్భస్రావం దేశంలో మితిమీరిపోతోంది. చాలావరకు డాక్టర్ల దగ్గిరికిరావు యీ కేసులు. అనాదిగా వొస్తున్న మందులూ, పద్ధతులూ అచ్చు స్వదేశ రకాలు చాలా వున్నాయి. జీవంపొందిన 'ఒవం' ovam గర్భకోశపు గోడకు అతుక్కుంటుంది. దాన్ని బైటకి తీసుకురావడానికే యీ ప్రియత్నాలు.

మందులు — ఇవి అనేక రకాలు వాడుతున్నారు. ఇంగువ.

చాలా విరోచనాలు కలగచేసే మందులు —

కలబంద - కలబందగింజలు - ఉలవచారు.

క్వైనా, ఎర్గట్ మొదలైన ఇంగ్లీషు మందులు. రుతుస్రావానికి తయారుచేసిన Patent మందులు.

ఇంకా పేర్లు తెలీని మూలికలు ఎన్నో.

ఆవా, రసం తాగుతారు కొందరు. కొందరు దూకడం బరువులు ఎత్తడం, పొట్టమీద గుద్దుకోడం, కింద దూకడం, పొట్టమీద పడడం, ఇట్లాంటి బాధలు ఎన్నో పడతారు. రహస్యంగా ఎవరు ఏ మూర్ఖమైన పనిచెప్పినా అది చేస్తారు. ఈ సహాయం కోసం తమకి ఇష్టంలేని పురుషుల కామాన్ని సంతుష్టి పరిచినవారున్నారు.

మరణాలూ, ఆజన్మాంతమూ అనారోగ్యమూ యీ రహస్య పద్ధతులవల్ల కలుగుతున్నాయి. డాక్టర్లు జాగ్రత్తగా యీ పని చేస్తే సాధారణమైన కాన్పుకన్న ఎక్కువ అవస్థలేదు. మూడో నెలలోపునే వీలు- అది దాటితే ఆరోనెలపైన శిశువునే బైటికి తియ్యవొచ్చు. నాలుగునించి ఏడోనెలవరకు ఇట్లాంటి పనిచేస్తే ఉపద్రవం సంభవిస్తుంది.

రెండోవిధం 'Os' గర్భాశయద్వారం తెరిచి, గర్భకోశాన్ని ముణుచుకునేట్టు చేసే సాధనాలు.

వీటికోసం - స్త్రీలుగాని, మంత్రసానులుగాని లోపలికి దూర్చని సన్నని వొస్తువు ప్రపంచంలో లేదనవొచ్చు.

సూదులు - చెట్లకొమ్మలు - చెట్లవేళ్ళు - మందువేళ్ళు గరిటెలు - కత్తులు- ఘాటైపుంప్లు చేసేమందులు వుండలు- అనేకం ఇట్లా.

గర్భకోశమార్గాలువాస్తాయి, పుళ్ళవుతాయి, గర్భకోశాలు చిరుగుతాయి, రక్తం వరదలవుతుంది. చాలాసార్లు అనుకున్నకార్యంకాదు.

సగంచేసి బైటపడుతుందని భయంవేసి మంత్రసాని పలాయనమవుతుంది. ఎవరిసహాయమూ అడగడానికి భయం.

లక్షలకొలది స్త్రీలు యిట్లాంటి ఘోరబాధలు పడు తున్నారు. పతివ్రతలూ, చదువుకున్న స్త్రీలూ, మూడోపెళ్లి చేసుకున్న వితంతువులూ, వొంటో రక్తంలేని జీర్ణశరీరాలూ, అంటున్నారు— 'షడవలసిందే! బాగా అయిందిశాస్తి! మరి ఆ పని ఎవరుచెయ్యమన్నారు?' అని!

అవును. మీలో కొందరికి సుఖంగా జరుగుతోంది! కొంద రికి మీలో 'అదిమాకు జరిగేవీలు లేదే, ఏ మొగాడూ మా వంక చూడడే' అనే యీర్ష్య. దానే లాభంలేదు. నీతి అనే పేరుతో మీ కుళ్ళుని ఇతర్ల మీాద కక్కి పతివ్రతలనే కీర్తితో తిరిగే రోజులు పోయినాయి. మీారహాస్యం బట్టబైలయింది. ఇంక 'పాలసీ' కోసమన్నా సానుభూతి చూపండి. కర్మపేరా, నీతిపేరా సంఘక్షేమంపేరా, అనాథలమీాదా, దరిద్రులమీాదా, కర్కశత్వంచూపి, నలిపి, కాలరాసినరోజులు ముగిశాయి. ఇంక ఘోరుకోరు ప్రజలు, జాగ్రత్త! కులంవెనకా, ధనంవెనకా, బనా రసు చీరలవెనకా, మర్యాదలవెనకా, ఏముందో బహిరంగమై పోయింది. మేలుకోండి. బోర్డింగులలో, గవర్నమెంటుబళ్ళల్లో పెళ్లికాని టీచర్లు, ఎదిగిన ఆడపిల్లల్ని పెట్టేహోంసలు, ఇళ్ళల్లో చాలా విధవల్ని పెట్టే బాధల్ని మించిపోతున్నాయి. ఉద్యోగా లని పేర్లు పెట్టుకుని, సుఖమైన కాపరాలు వొదులుకొని, ఎండి పోయిన దనడలూ, హృదయాలూ, పాలూ, వొళ్లూ- మీా శవ త్వం చాలదూ, పైగా సుఖపడపొయ్యే చిన్నపిల్లల్ని మీావలెనే రోగిష్టి మనసులతో తయారుకమ్మని ఆదర్శం చూపుతున్నారు.

ప్రస్తుతం సర్వసాధారణంగా జరుగుతున్న యీా గర్భ స్రావాల్ని జరగటంలేదనీ, జరగకూడదనీ కళ్ళుమూసుకోడంవల్ల

లాభంలేదు. ఇంత చౌర్యమూ, ఇంతబాధా ప్రజలలో లేకండా నివృత్తిమార్గాలు ఆలోచించడం జ్ఞానులవిధి. పెళ్ళికాని తల్లుల మీదా వారి పిల్లలమీదా సంఘంలో ద్వేషంపోవడం యీనాడు జరిగే పనికాదు. గర్భనివృత్తిమార్గాలు ప్రచారం కావడం స్త్రీలు అవలంబించడంకూడా త్వరలో అయ్యే పనికాదు. ఈ లోపల స్త్రీల అవస్థ తప్పించాలంటే గర్భస్రావం అశాస్త్రీయమనే యీ 'లా'ని సంస్కరించాలి.



# యోగం.



స్త్రీకి స్వేచ్ఛకావాలన్నా, సంసారాలలో మార్పుకావా లన్నా పురుషుల ఆత్మలలో పరిణామంకావాలన్నా, అంతా ఎందుకంటే, వ్యక్తిలో ఆనందమూ సౌఖ్యమూ వృద్ధి పొందేం దుకు. జీవితపు 'స్ట్రగుల్' అంతా ఆనందంకోసం- విచారాన్నించీ చిరాకునించీ, దుఃఖాన్నించీ, బాధనించీ తప్పించుకోడంకోసం. ఆ ఆనందాన్నే నమ్ముకుని దాన్నే గురిగాపెట్టుకుని, కీర్తి, మర్యాదా, ఎక్కువధనం, నీతులూ, ధర్మాలూ, ఇట్లాంటి ఆ ఆనందపు నీడల్ని ఆనందమనుకునే భ్రాంతిని వొదలడం వివేకవంతుల లక్షణం. గొప్ప ఆనందం పొందాలంటే, ఆనందమిచ్చే వొస్తువు లనూ పరిస్థితులనూ సంపాయించడం కన్న, ఆనందం పొందగల గుణాన్ని వృద్ధిచేసుకోడం ముఖ్యం. అట్లాంటిగుణం వుంటే ఆనందమిచ్చే వొస్తువుల్ని వెతుకుతో కష్టపడి సంపాయించ డానికి ప్రయత్నించ నక్కర్లేకండా, వున్నవాటితోనే అంత ఆనందమూ సంపాయించవొచ్చు. ఆ శక్తి లేనివాళ్ళే, ఆశక్తి లేకనే, లేనంతవరకే, ఆనందాన్నిచ్చే పరిస్థితులకోసమూ, పదా ర్థాలకోసము, తంటాలుపడతారు.

మనం పొందే ఆనందంలో భేదాలూ, వెరయిటీలూ, కాక 'క్వాలిటీ' లోనే 'ఇన్‌టెన్‌సిటీ' లోనే భేదాలున్నాయి. వ్యక్తి సామర్థ్యంలో భేదం దానికి కారణం.

స్త్రీ పురుషులు ఒకరినించి ఒకరుపొందే సంతోషం చాలా విషయాలతో సమ్మిళితం. గొప్ప ఆనందం పొందేవారికి

అది ప్రేమవల్ల కలుగుతోంది. ఆ ప్రేమవల్ల కలిగే ఆనందం తక్కిన సౌందర్యం, గుణం, చాతుర్యం, రతి మొదలైనవి ఏవీ యివ్వలేవు. ప్రేమని స్వీకరించగల గుణం, ప్రేమని యివ్వడానికి వున్న శక్తి ముఖ్యం.

గొప్ప ప్రేమ, కలగడానికి (అదృష్టం సంగతి అట్లావుంచి) ముఖ్యమైన పరిస్థితి, ఆ ప్రేమకి అర్హత వుండడం, లేక పోతే సంపాయించడం. అనేకమంది స్త్రీల వెంటపడ్డారాదు, వారికే ప్రపంచమంతా ప్రేమో అని అరుస్తో పరువులెత్తినా రాదు. రోజుకో స్త్రీని అనుభవించి ఏ ఆనందాన్నీ ఎరగకండా వుండ వొచ్చు. ఒకే స్త్రీతో నిరంతరమూ పరిచయం కలిగివుండడం వల్ల ఎట్లా పాతపడి అలవాటై పోతుందో, అట్లానే నిరంతరమూ స్త్రీలని కొత్త కొత్తవారిని అనుభవిస్తే, అదీ పాతపడి, అల వాటై, ఇంతేనా అనిపిస్తుంది. స్త్రీ అంటే అసహ్యంచూపే వారూ, ప్రేమని తృణీకరించేవారూ, స్త్రీ సంబంధాన్ని అసహ్య మనేవారూ, స్త్రీని చవకచేస్తో కథలువ్రాసేవారూ, వారందరూ స్త్రీ దొరకనివారో స్త్రీని అదేపనిగా బావురుని అనుభవించిన వారో ఐవుంటారు.

ముఖ్యం స్త్రీత్వంలో గౌరవం, ప్రేమమీద విశ్వాసం, ఆసంబంధలో 'మిస్టరీ' కొత్తదనం పోగొట్టుకోకపోవడం.

ఎంతమందిని మోహించామని కాదు ప్రశ్న, ఎంత గొప్పగా అద్భుతంగా ప్రేమించగలిగాము అనేది.

అందువల్లనే, సాగినన్నాళ్లు, భర్తని దైవంగా చూడ మనే సాధన, అద్భుతంగా స్త్రీహృదయాన్ని నింపింది. లోపాలు

చూడలేని అంధత్వం లోపమేఐనా, జడత్వలక్షణమేఐనా, స్త్రీని తృప్తితో, ఆనందంతో నింపింది.

ఇట్లా ప్రేమని ఆరాధించే గుణాన్ని సాధనవల్ల వృద్ధిచేసుకోవాలి. ముఖ్యం తమమనసుల్ని మార్చుకోడం, స్వభావాల్ని వృద్ధిచేసుకోడం, తమకి ఏమిస్తుందా అని గాక స్త్రీని ఆమె కోసమే, ఒక వరంగా ప్రేమించడం.

అదిగాక ఆనందాన్ని ఇచ్చేందుకు ఇంకా ఒకటి రెండు పద్ధతుల్ని చెప్తాను.

మొదటిది

ఈ కింది మూడు విషయాలూ ఇదివరకే చెప్పాను.

1 స్త్రీపురుషులు ఒకరికొకరు అలవాటు కాకూడదు.

2 ఒకరినొకరు తిండికిగాని డబ్బుకిగాని, సౌఖ్యానికిగాని, మోహానికిగాని, చివరికి అందానికిగాని ఆధారంగా instruments గా చూసుకోకూడదు.

3 తమ జీవితంలో అన్నిటికన్నా గొప్ప (ideal)ఆదర్శం రెండోవారిని ప్రేమించగలగడంకిందనే ఎంచుకోవాలి.

కొత్తది - సంయోగం. సంయోగానికీ, యోగానికీ అట్టే దూరంలేదు! యోగమంటే ప్రస్తుతం మనసుని ఒకేదానితో కలపడం అనుకోండి. మనసుని దేనిమీద ఏకాగ్రం చేసినా ఆనందం వొస్తుందంటారు యోగులు. సాధారణులకు emotion ఆరాధనతో కలిస్తే సులభంగా మనసు లగ్నమౌతుంది. స్త్రీపురుష సంబంధంలోవున్న emotional intensity ఇంకో విషయంలోరాదు. కనక ఇక్కడ మనసును కేంద్రీకరించడం

సులభమౌతుంది. స్నేహం, కళ, sex ఉద్రేకం, అన్నీ ఒక చోట ఏకమైనాయి. కళలన్నిటిలోకీ, సాధన లన్నిటిలో ఉన్నత మైనదీ, సులభసాధ్యమైనదీ, యీ రతికళ, ప్రేమకళ.

స్త్రీపురుషులు ఒకరినొకరు తమ స్వభావమంతటితోనూ ఆరాధించుకోవాలి. ఈశ్వరుణ్ణి సాక్షాత్కారంగా చూసినవాళ్లు వుంటే వుండనీ, తక్కినవాళ్ళకి, తమ ప్రేమనిపొందినవాళ్లే ప్రపంచానికంతా ఉన్నతులు, వారొక్కరే కావలిసినవాళ్లు.

'జీవనం, జీవనానాం' అట్లా ఆరాధించడం చాతకానప్పుడు చాతనయ్యేట్టు హృదయాన్ని మార్చుకోవాలి. మనిషిని కొత్తవారిని వరించడంవల్ల సహాయం జరిగితే అట్లానే చెయ్యాలి. హృదయాన్ని మార్చాలి, హృదయానురక్తుల్ని అంగీకరించే ధైర్యం తెచ్చుకోవాలి.

పూర్వం భర్తని కట్టి దైవంగా చూసుకోమన్నారు.

ఆ సూత్రాన్నే మార్చి, యీ నాడు,

దైవసమానుల్నే యేరుకోండి, మార్చండి, మారండి.

దైవంకన్న అధికులుగా చూసుకోండి.

అని స్త్రీ పురుషుల్ని అంటున్నాను. ఒక్క స్త్రీలనేకాదు. రెండోది

ఈ సంగతులు ఇదివరకే చెప్పాను.

1. సృష్టికార్యాన్ని చవకచేసుకోవొద్దు. నీచపరచవొద్దు. అసహ్యమూ, పాపమూ అనుకోవద్దు. లేచిపోవడాలూ, రహస్య సంబంధాలూ వీటినిగురించినవ్వవొద్దు. Scandals మాట్లాడవొద్దు.

2. అమితమైన కోర్కె కలగంది, గొప్ప స్నేహం లేంది, బలీయమైన ఆకర్షణలేనిది, కలవవొద్దు.

3. చక్కని పరి స్థితులు, ఆరోగ్యం, శుభ్రమైన స్థలం, వాతావరణం, చక్కని శాంతమైన కాలం, ఇన్ని కుదరంది పక్కమీద చేరవొద్దు.

4. కలుసుకుంటామనే కాంక్షలో expectation తో ఆడుకోవాలి. కాంక్షకి లొంగక, చూసుకుని నిదానించి, ఆనందించాలి. తృప్తిపడని కాంక్ష మన యజమాని ఐనప్పుడు మనకి బాధ. మనం యజమానులమైనప్పుడు ఆనందం. కొత్తది.

సృష్టికార్యమప్పుడు ఏకాగ్రత సాధన చెయ్యాలి. ఒకరి మీద ఒకరు లేక ఇద్దరూ ఆ కార్యంమీద మనసు నిలపాలి.

ఈ సృష్టికార్యం ఈశ్వరకార్యం ; అంటే, యీశ్వరుడు వుంటే అతను సృష్టించడంవల్ల పొందిన ఆనందం, అని విశ్వసించండి. దాని ద్వారా, అందుకోగలిగిన ఆనందోద్రేకానికి అంతం లేదని, అనుభవిస్తున్నది చాలా స్వల్పమనుకోండి. ఏవేవో సంగతులు యోచించవొద్దు. యజ్ఞానికివలె ఆయత్తులు కావాలి. (Preparations) ప్రిపరేషన్సు చేసుకోవాలి. స్థల శరీర మనో శుభ్రం ఆవసరం. సౌఖ్యాన్ని పొందుతూ, సౌఖ్యాన్ని పొందుతున్నాము అనే భావాన్ని మనసునించి తొలగనీకండి. (self-consciousness).

ఇంత ఆనందం ప్రపంచంలో వుంటుందా అన్నంత ఉన్నత స్థితికి వెడతారు, యీ పద్ధతివల్ల. యీ యోగం సిద్ధించడానికి:

1. తీవ్రమైన పరస్పరాకర్షణ.

2. ఆరోగ్యం, మనోబలం, సుందర పరి స్థితులు. డిస్టర్బెన్సు వుంటుందనే భయంలేకపోవడం అవసరం.

# వంధ్యత్వం



మనుషులకి, స్వేచ్ఛ, కళ, స్నేహం, రొమాన్సు, ఇవన్నీ ఎంత అవసరమైనా, ఈ సుఖాలకి అన్నిటికీ ఆధారం, పునాది-భోజనమూ, సెక్సు. ఈ రెండూ తృప్తిపడ్డప్పుడే తక్కినవి రాణిస్తాయి. రెండు రోజులు పస్తుపడుకున్నవాడికి, మలయమారుతమూ, మల్లెపువ్వులూ, మందయానలూ, ఏమాత్రమూ ఆహ్లాదాన్నియ్యలేవు. సెక్సు వాంఛ తృప్తిపడనివాణ్ణి అవన్నీ పైగా బాధిస్తాయి. ఈ రెండు వాంఛలకీ చాలా సన్నిహితమయింది బిడ్డలమీదికోర్కె - ముఖ్యంగా స్త్రీలకి.

స్త్రీకి బిడ్డ — (physica) శరీర సంబంధమైన అవసరం-మనసుకీ, హృదయానికీ, ఆమె సర్వశక్తులకీ, emotions కీ అత్యావసరం. పురుషుడు తనవంక చూసిన నిముషంనించి, అతని కావిలింతలు, అతనిశక్తిద్రవం తన గర్భంలోకి ప్రవేశించడం, తొమ్మిది నెలలు తనలో పెరగడం, బిడ్డని చూడడం, తాకడం, బిడ్డ తనని తాకడం, తనపాలుతాగడం — ఇవన్నీ స్త్రీకి తానే యెరగని, యింకెవరి మనసుకీకూడా తట్టలేని గొప్ప ఆనందాన్నిస్తున్నాయి. బిడ్డ ఏడుపు, చిరునవ్వు, గంతులు, జబ్బులు, ముద్దుమాటలు, అతనిబాధలు,— అతనిమీద చెదరని గొప్పప్రేమ — ఇవన్నీ స్త్రీ emotions కి గొప్ప outlets. మాతృప్రేమ మనుష్యశక్తులన్నిటిలోకీ ప్రబలమైనశక్తి, యోధులకు అలివికాని ధీరకార్యాలు చేయించింది స్త్రీలచేత — మృగాలచేత. కళ్లని చెదరకొట్టే త్యాగాలకి కారణమయింది.

ఇటువంటి గొప్పమాతృత్వాన్ని చాలామంది స్త్రీలు ఎరగరు; పిల్లల్ని మోసి కన్నవాళ్లుకూడా. భర్తలు లేకపోవడంవల్ల గర్భాన్ని చెడకొట్టుకునేవాళ్లూ, పిల్లల్ని చంపేవాళ్ళూ, ఇతరులకి ఇచ్చేసేవాళ్లూ అనేకవేలు ఉన్నారు. ఇంత గొప్ప ఆకర్షణని తెంపి మాతృశోకంతో కాలడానికి స్త్రీలను సిద్ధంచేసే యీ సంఘక్రౌర్యం ఎంతకర్కశమో ఆలోచించేవాళ్ళు అరుదు. ఈ దేశంలో చాలామంది స్త్రీలు పిల్లల్ని పెంచలేక పిల్లల్ని అమ్ముకుంటున్నారు. అటువంటి కటిక దారిద్ర్యాన్ని కళ్లారాచూస్తో ఉపేక్షచేసి వూరుకుంటోంది ఐశ్వర్య లోకం!

దివ్యమైన మాతృఅనుభవంలోపమైతే స్త్రీ జీవితంశూన్యమౌతుంది.

ఈ ఆనందాన్ని యెరగని స్త్రీ జీవితంలో సగం ఆనందానికి గుడ్డిదై పోయిందన్నమాట. సకాలంలో బిడ్డనికనని స్త్రీ, తనకే అర్థంకాని అశాంతి, చిరాకులు, కోపాలు, జెలసీలు, నరాలతీపు, జీవితంలో వ్యర్థత్వయోచనలతో బాధపడుతుంది. ఇంక ఎన్ని సుఖాలువుండనీ అన్నీ వృథాగాతోస్తాయి ఆమెకి. పూర్వపురాణాలలో బిడ్డలకోసం రాజదంపతులు పడ్డట్టు చిత్రించిన బాధలుఅతిశయోక్తులుకావు. కాని నవీనస్త్రీలు తమకు కలిగేబాధలు బిడ్డలు లేని లోపంవల్లనని గుర్తించక భర్తలమీాదా, సంఘంమీాదా, ప్రభుత్వంమీాదా, దేవుడుమీాద, పనిమనుషులమీాద రుద్దుతున్నారు. కొంతమంది స్త్రీలకి బిడ్డలులేకపోవడం వెర్రెత్తిస్తుంది, పిచ్చిపుట్టిస్తుంది, దెయ్యాల్ని పట్టిస్తుంది. అందువల్లనే గర్భం బరువు, అసహాయత్వం, పరాధీనం, డోకులు, నెప్పులు, జబ్బు, మరణ

భయం, వీటి నన్నిటినీ తిరిగీ తిరిగీ భరించి, తిట్టుకుంటో, మూలు క్కుంటో, మళ్లీ మళ్లీ పిల్లల్ని కంటారు స్త్రీలు.

ప్రస్తుతం పరిస్థితులు మారడంవల్ల స్త్రీలకు బిడ్డలు గొప్ప న్యూసెన్సూ సమస్యలూ అవుతున్నారు. పుట్టినవారిలో చాలామంది మట్టిపాలై దుఃఖాన్నిస్తున్నారు. గర్భశోకమంత గొప్పశోకం లోకంలో కనపడదు. ఈ స్థితులకు సగానికి హెచ్చు పట్టణజీవితమూ, ఆ జీవితానికి తగినట్టు, మనుష్యుల అలవాట్లు మారకపోవడమూ ముఖ్యకారణాలు. స్త్రీల అనారోగ్యం, బల హీనత్వం, పూర్వంనించి దేశంలో వొస్తున్న common sense, అవివేకం, అనుభవం, మూఢాచారంకింద జతపడి, నశించడం; కొత్త విజ్ఞానాన్ని స్త్రీలకి పాఠశాలల్లోగాని, ప్రభుత్వంనించిగాని లభించకపోవడం; స్త్రీలకేపూర్వానుభవం మూఢనమ్మకమయింది. నవీన నమ్మకం పాశ్చాత్య మయింది. స్త్రీలు ఇంటిపనీ, పిల్లల పనీకాక, పబ్లిక్ వ్యవహారాల్లో ప్రవేశించి, తగినంత శ్రద్ధ పిల్ల లకి ఇవ్వలేకపోవడంవల్లా; బిడ్డలు అన్ని పనులకన్నా ముఖ్యం, మిగిలినకాలాన్ని మాత్రమే తక్కిన అవసరాలకు వినియోగిం చాలి, అని గుర్తించక పోవడంవల్లా; బిడ్డలకి కావలసిన ఆహా రమూ, కాంతి, గాలి, విశాలత్వం, కరువుకావడంవల్లా; ధనం చాలకపోవడం, భర్తకి వ్యవధిలేకపోవడంవల్లా ఈస్థితి ఏర్పడ్డది.

బిడ్డనికనగానే స్త్రీ బిడ్డని పెంచడానికి సృష్టి ఉపయోగిం చుకొనే సాధనంగా మారాసని తెలుసుకోవాలి. నవీనస్త్రీకి, ఫాషన్లు, ఖరీదుగల చీరెలు, సినీమాలు, మీటింగులు, టీపా ర్టీలు అన్నీ కావాలి. బిడ్డని కనకండా మానడం, వారి పుటకని స్వాధీనంలో ఉంచుకోడం, పుట్టినవారికోసం శక్తినిచ్చి వారి ఆరో

గ్యానికి త్యాగం — వీటికి అవసరమైన మనోబలం నేర్చుకోరు. వాళ్ళు చదువుకున్న విద్య సహాయం చెయ్యదు. అందువల్ల పట్టణాలలో అమితమైన దుర్గతిలో బతుకుతున్నారు స్త్రీలు.

గర్భ నిరోధకమార్గాలు, స్వంత ఆర్జన, వోట్లు, హక్కులు, ఇవన్నీ స్త్రీ స్వేచ్ఛకి అవసరమే. స్వతంత్రం చాలా అవసరమైన వాస్తువే. స్వతంత్రత ఉండాలి. కాని స్వతంత్రతని ఉపయోగించ వలసిన అవసరం చాలా తక్కువగా ఉండాలి. ఆత్మహత్య చేసు కోడానికీ, తప్పతాగడానికీ, భర్తనీ పిల్లల్నీ విడవడానికీ స్వేచ్ఛ ఉండితీరాలి. కాని ఆస్వేచ్ఛని ఉపయోగించుకోవలసిన అవసరం కలగడం ఏమీ గొప్పగాని అభిలషించవలసిన విషయంగానికాదు. స్వేచ్ఛ దేనికి? దేనినించి? అని ప్రశ్నించుకోవాలి.

తిండినించీ, ప్రేమనించీ, బిడ్డలనించీ స్వేచ్ఛకావాలనడం సహజమూ, ఆరోగ్యమూకాదు. కొందరున్నారు, ఆ స్వేచ్ఛ కావాలనేవాళ్లు. వాళ్ళ స్వేచ్ఛకి అభ్యంతరము వుండకూడదు; ఆకోరడం తప్పుకానీ, వొప్పుకానీ. కొన్ని పరిస్థితులలో ఆస్వేచ్ఛ ప్రతివారికీ అవసరంకావొచ్చు.

ఈ బిడ్డల అవసరం స్త్రీల అందరికీ ఒక్కటే ఏట కల గదు. మనదేశంలో ముప్పాతిక మందికి పురుషుడి అవసరం గుర్తించందే, పురుషుడికోసం శరీరమూ మనసూ సిద్ధంకాందే భర్తలు ప్రాప్తించినట్లే, బిడ్డలకోసం, శరీరాలూ, హృదయాలూ స్తనాలూ, తయారుకాకముందే బిడ్డలు కలుగుతున్నారు. కలి గారుకదాఅని, అవసరంకొద్దీ, సృష్టి ఆమె శరీరంలో అవసరమైన మార్పులూ ఆమనసులో కావలిసిన ఇన్‌స్టింక్‌ట్సు (instincts) నీరసంగా కల్గిసుంది.

కొందరికిమాత్రం మాతృత్వం, మేల్కొన్నదాకాకూడా పిల్లలు కలగరు. కొందరికి ఎప్పుడూ కలగరు. బిడ్డలమీద కోర్కె కలగందే, బిడ్డలుకనవలసిన అవసరం ఏమీలేదు. బిడ్డలుకనడం ఏమోక్షమూ, ఏధర్మమూకాదు. భర్తకి బిడ్డలుకావలసి, భార్యకి అఖ్ఖర్లేకపోతే, తనద్వారా అతను కనడానికి స్త్రీ అంగీకరించకూడదు. కాని స్త్రీకి బిడ్డమీద కోర్కె కలిగిందా, బిడ్డల కోసం అతి తీవ్రమైన ప్రయత్నం చెయ్యాలి.

బిడ్డలు పూర్వజన్మ సుకృతమనీ, ఏ శాపాలవల్లనో, పాపాలవల్లనో కలగరనీ, ప్రయత్నించి లాభంలేదనీ, జాతకమనీ, అనడంమూర్ఖం. ప్రపంచంకొన్ని rules మీద నడుస్తోంది. ఎందు తాటాకులకు ఎప్పుడు నిప్పంటించినా అంటుకుతీరతాయి. పురుషుడివీర్యం స్త్రీ అండంలోకలిస్తే పిల్ల ఏర్పడుతుంది. కలవడానికీ సరిగా కలవడానికీ అభ్యంతరంకలిగినప్పుడే కర్మ పనిచేస్తుంది. కనక పిల్లలు కావలసిన స్త్రీ నిరుత్సాహపడక, సరైన పరిస్థితులు కలిగించుకోడానికి ప్రయత్నించాలి. పిల్లలు పుట్టడానికీ, పుణ్యాపాపాలకీ, నీతి అవినీతులకీ, సంబంధంలేదు. బిడ్డ స్త్రీజన్మహక్కు, భర్తఉన్నస్త్రీకీ, లేనిస్త్రీకీకూడా. బిడ్డని కనకూడదని శాసించడానికి ఏమతానికీ, సంఘానికీ, ప్రభుత్వానికీ, అధికారంలేదు; పుట్టబొయ్యే బిడ్డ రోగిష్టి, పిచ్చిది, అవుతుందని ముందు చెప్పగలిగితే తప్ప.

బిడ్డలు కలగకపోవడానికి కారణాలు స్త్రీలోపమో, పురుషుడిలో లోపమో అయివుండాలి. ఇదివరకంతా లోపాలు స్త్రీలోనే యెక్కువ అనుకునేవారు. ఇప్పుడు పురుషుడిలోనే అని ఎక్కువగా రుజువు అవుతోంది. స్త్రీలో లోపం కనుక్కో-

డం సులభం. పురుషుడీ పరీక్షకి లోబడడుగనక కనుక్కోడం కష్టం. పురుషుడి లోపమని వొప్పుకుంటే సంఘానికి చాలా సమస్యలు తటస్థిస్తాయి గనక, స్త్రీమీద బాధ్యత వెయ్యడం మామూలయింది.

పురుషుడికి ఏమాత్రం పుంసత్వమున్నా గర్భం కలగచెయ్య కలడు. కాని కొందరికి ఏమాత్రమూ వుండదు. పుటకతో వుండదు. కొన్ని అభ్యాసాలవల్లా వుండకండాపోవొచ్చు. సుఖ రోగాలవల్లనూ కావొచ్చు. ఈ సంగతి తెలిసికూడా పెళ్ళిళ్ళు చేసుకుంటారు. స్త్రీలని దాచుకుంటారు, పరువుప్రతిష్టలకోసం. చికిత్సకోసం ప్రయత్నం చెయ్యరు. చాలా నీతివర్తను లను కీర్తిని సంపాయించుకుంటారు. వేదాంత శాస్త్రంలో గట్టివా రవుతారు. తెలిసీతెలియకా, భర్తల స్తితిని బైటపెట్టక, జీవితమంతా, కన్యలుగా గడిపిన గొప్ప సాధ్వీమణులున్నారు. తమ సెక్సుని, బిడ్డలమీదికాల్చే కోర్కెని తమలోనే జీర్ణం చేసుకుని, నాశనమైనవాళ్లు.

కొందరు పురుషులకి పుంసత్వ ముంటుంది. కాని రేతస్సులో జీవాణువులు (spermatora) వుండవు. చాలా వంధ్యత్వాలకి ఇదే కారణం. ఇది కుదరడం కష్టం.

ఇది కొన్ని వంశాలలో తరతరాలుగా వొస్తుంది. ప్రతి తరంలోనూ స్త్రీలు ఇతరులకి కని, ఆవంశాన్ని నిలబెడుతోనే వుంటారు.

## స్త్రీలలో లోపాలు

(1) తిండితిని, శరీరవ్యాయామంలేక ఊరిపోవడం

(2) రక్తం తక్కువ

(3) బలహీనం

(4) గర్భకోశంలో - పుటకలోనే లోపం - లేక ఏజబ్బు వల్లనో కలిగినది

(5) సుఖరోగాలు

(6) వంశంలో వొస్తున్న వంధ్యత్వం

బిడ్డలమీద అమితంగా కోర్కె జనించిన స్త్రీ మొదటిలో చెయ్యవలిసినపని పురుషుణ్ణి మార్చడం. ఆ పనిచేస్తే నూటికి తొంభై మందికి పిల్లలు కలుగుతారు. కలక్క కలక్క పిల్లలు పుట్టారని వుత్సవాలు చేస్తారే! అక్కడ సాధారణంగా ఇంట్లాంటిది ఏదో జరిగివుంటుంది. పురాణాల్లో ఇట్లా పురుషుల్ని ఆహ్వానించి వంశాలు నిలబెట్టుకోడాలు చదివి వుంటారు. ఈ కలికాలంలో నీతిని రక్షించాలని ఆ పద్ధతుల్ని నిషేధించారు.

తీర్థయాత్రిలు వెళ్లి వొచ్చీ, గుళ్లచుట్టూ ప్రదక్షిణాలు చేసీ, యోగుల దగ్గిర వరాలుపొందీ, పిల్లల్ని కంటారే, అక్కడ కూడా పురుషుడు మారడమే తటస్థించి వుంటుంది.

భర్తలు అంగీకరించాలి. అంగీకరించకపోతే, "బిడ్డలు ఇవ్వలేనివాడివి నువ్వేమి భర్తవి!" అని ధిక్కరించాలి స్త్రీ. "పురుషునిదే తప్పు" అని చెలం చెపుతున్నాడని వాదించండి, ఆ పురుషుడు మీామీద తప్పు వెయ్యకండా. చలమేకాదు. ప్రస్తుతం ఈ విషయమై పరీక్షలుచేసిన డాక్టర్లూ అదే మాట అంటున్నారు.

ఇదివరకు పిల్లల్ని కన్న పురుషుణ్ణి ఏరుకుంటే మరీమంచిది. అప్పుడూ లాభం లేకపోతే, డాక్టరు సలహా తీసుకోవాలి స్త్రీ,

తన దేహంలో లోపమేమోనని. సరైన ఆహారం, శరీర వ్యాయామం, శుభ్రమైనగాలి, పరదేశ ప్రయాణం ఇవన్నీ సహాయం చేస్తాయి. ఎందుకంటే ఇవి శరీరమనో ఆరోగ్యాల్ని వృద్ధిచేస్తాయి. చెట్లచుట్టూ ప్రదక్షిణాలు మొదలైనవాటి ఉద్దేశ్యం ఇంతేనేమో !

ఏదో కళాశాస్త్రాలలో వర్ణించిన స్త్రీ పురుష భేదాలూ అవయవపు కొలతల హెచ్చు తగ్గులూ, కుల భేదాలూ, వయోభేదాలూ, దగ్గిరవరసలూ, రతిలో అసంతృప్తి, మనసులో అసహ్యాలూ, ఇవే మీకారణాలు కావు వంధ్యత్వానికి.

స్త్రీకి బిడ్డని కనడానికి హక్కువుంది. కాని సత్సంతానాన్ని కనే బాధ్యతకూడా వుంది. తాను ఆరోగ్యవంతుల్ని శిష్టుల్ని కనలేనని తెలిసినప్పుడు, తాను కనకూడదు. పిల్లని పెంచుకోడం వల్లం ఆ కోర్కెని చాతనైనంతవరకు తీర్చుకోవాలి. కనడం చాతనైన స్త్రీలు, పాతివ్రత్యం చాదస్తాలు పెట్టుకుని, పెంచుకోడంతో తృప్తిపడడం, అన్నం అనుకుంటో మట్టితిసడంలాగుంటుంది. భర్తవల్ల సత్సంతానం కలగదని తోచినప్పుడు, అతన్ని తప్పించడం సంఘంయడల స్త్రీకి ముఖ్యమైన బాధ్యత అవుతుంది.

ధీరులూ, ఉత్తములూ ఐన పురుషులవల్ల అనేకమంది స్త్రీలు బిడ్డల్ని కనే వీలు కలిగినట్టయితే దేశసౌభాగ్యానికి చాలా [illegible]



# ముగింపు.

ఈ విషయం అంతంలేనిది. నేను చెప్పతలుచుకున్నది చెప్పాను. అనేక సంవత్సరాలనించి నన్ను కలవరపెడుతో, ప్రీతి అనుభవంతోటీ ప్రతిసంవత్సరమూ మారుతోవుండే నా వూహాలను, కొంతవరకు చేర్చి వ్రాశాను. కాని యివే వాస్తవమనీ, యివే అనుకరింపతగినవనీ శాసించడంలేదు. ఈనాడు యివి నాకు తోచిన సత్యాలు. ముందునాటికి మారిపోవొచ్చు. ఇతరులకి ఇవి సత్యాలుకాకపోవొచ్చు.

ఒకరికి ఉపయోగించిన పద్ధతులు తక్కిన ప్రజలందరికీ అనుకూలిస్తాయని అనుకోడమే, లోకంలో చాలా మూర్ఖానికీ, దుఃఖానికీ, బాధకీ కారణం. చాలామంది యీ పుస్తకం హాని కరమనీ, ఉన్మాదమనీ, తగలపెడతారేమో! కాని యే కొద్ది మందికో యీవిధమైన జ్ఞానం, వుపయోగించవొచ్చు. వాళ్లు కూడా యిది చదివి, యెంతవరకు యిట్లాంటిపద్ధతులు తమకి న్యాయమో, అనుష్టేయమో, ఆలోచించుకోవాలనే నావూహ. అంతేగాని ఇది ఒక సంపూర్ణమైన 'system' అనికాని, యీ విధంగా లోకం మారాలనికాని, మారుతుందనిగాని నా ఆశయం కాదు.

ఈ నాటికి యీ మార్గం, యీ పద్ధతులు నాకు మంచి వని తోస్తున్నాయి. తప్పుకావచ్చు. కాని తప్పైనా, నా మన స్సుకి తోచాయి గనక, వీటిని అనుష్టిస్తే, నూతన కాంతి నాకు యింకా కలగగలదనే నా నమ్మకం.

ఏ మనిషినో, పుస్తకాన్నో, ఆచారాన్నో, గుడ్డిగానమ్మి పాత ధర్మాలు, పాతనీతివచనాలు ఏకరుపెడుతో, తిరిగే జడ

ప్రాయులకు అభివృద్ధి సున్న. సాహసంచేసి, తమకి తోచిన తప్పు అభిప్రాయాలనైనా, సాధనచేయగలవారికే అభివృద్ధి. స్వంతంగా ఆలోచించుకోవాలి. తప్పైనాసరే, అనుష్ఠించాలి సాహసంతో. బుద్ధికి అందినంతవరకు యోచించాలి. మనకి తోచిందే మనకి సత్యం. ఎంత గొప్పవారైనా యితరులకు తోచింది మనకి సత్యంకాదు, అది మనకకూడా సహజంగా తోస్తేనేగాని.

దూరకేముందు చూడవలసిందే గాని, చూస్తో, ఆగో చిస్తో యెప్పుడూ నుంచుంటే, అదే జడత్వం, అదే మృత్యువు.

నేనీ పుస్తకంలో చూపిన సంఘ లోపాలు, యీ దేశ స్థులలోనే కాదు, లోకమంతటా వున్నాయి. తర తరాలనించి పురుషుడు స్త్రీని చేస్తున్నది అన్యాయమే! ఆమె ఆత్మగౌర వాన్ని చంపాడు. స్త్రీ దాన్ని మళ్ళీ సంపాయించుకోవాలి. తన యిష్టం వచ్చినట్లు, తనకి తోచిన మార్గాన ఆమె తిరిగి తన గౌరవాన్ని పొందాలి.

అందుకు ముఖ్యసాధనం ఎదిరింపు. అన్నిటికీ, గృహానికి, భర్తకి, పెద్దలకు, పురాతన ధర్మాలను, బూజుపట్టిన నీతులకు, తన అభివృద్ధి కాటంకం కలిగించే ప్రతి సంస్థకూ తిరగబడి, నలిగి, తన జీవితం అర్పిస్తేనేగాని పోయిన తన ఆత్మను తను తిరిగిపొందలేదు. ఈ భయంలో, సిగ్గులో, బద్ధకంలో, బాని సత్వంలోంచి, మేల్కొని, తన నిజమైన హక్కులను, స్వతం త్రాన్ని, ధిక్కరించి లాక్కోవాలి. అప్పుడే తన ఆత్మని ధన్యం చేసుకుంటుంది. తక్కిన ప్రపంచాన్ని ఉద్ధరిస్తుంది.

ఈ పుస్తకం చదివి ప్రజలూ, సంఘాలూ చెడిపోతా యని కొందరంటారు. ప్రజల్నీ సంఘాల్నీ పాడుచెయ్యగలిగిన శక్తిగలవాడనని నన్ను అనడం నాకు చాలా గౌరవం. కాని ఎవరూ పాడుకారని నాకు తెలుసు. నాపుస్తకం చదివినంత మాత్రాన, నామాటల్ని నమ్మి, వినాశనంలో పడేటంత బుద్ధిహీనులు యెక్కడా లేరని నా నమ్మకం. అంతకన్న నాతోడి ప్రజలపైని నాకు గౌరవమూ, విశ్వాసమూ వుంది.

ఏవన్నా సందేహాలు వుంటే నాకు వ్రాయండి.

బక్కింగుహాము పేట,
బెజవాడ.

గుడిపాటి వెంకటచలం.